సేవాగ్రామం
(వయా) వార్ధా (సి. పి.)

# పీఠిక



అగర్వాలా రచించిన యీగ్రంథానికి "గాంధీరాజ్యాంగం" అన్న శీర్షిక అన్ని విధాలా తగినది కాదేమో; అయినా అది కొంతవరకు సమంజసమైన సంక్షిప్త నామకరణమేనని అంగికరింపవచ్చును. నారచనలను అవలోడించి, వాటిని ఆధారముగా చేసుకుని ఆయన ఈ గ్రంధాన్ని రచించాడు. చాల సంవత్సరాలనించే ప్రిన్సిపాల్ అగర్వాలా నారచనలకుభాష్యంచెబుతూఉన్నవ్యక్తి. తాను ఏదిరాసినా, ఎందునా అపార్థం రాకుండుటకై, నేను పర్యవేక్షించిన తరువాతనే ప్రచురిస్తూ వస్తున్నాడు. ఇలా చేయటంలో ఒకలాభం ఉంది, ఒకనష్టమూ ఉన్నది. లాభం ఏమిటో అందరికీ ప్రత్యక్షమే. ఇక నష్టం ఏమిటీ అంటే - అతని రచనలోని ప్రతి అంశమూ నా అభిప్రాయాన్నే స్పష్టీకరిస్తున్నట్టు పాఠకుడు అపోహపడతాడు: కాగా పాఠకులెవరూ అలా అపోహపడకుందురుగాక యని హెచ్చరిస్తున్నాను. ఈ గ్రంధంలోని ప్రతిఅక్షరానికీ నేనే బాధ్యత వహించవలసివస్తే.... నేనేరాసే వాణ్ణి! ఇతర పనులెన్నో ఉన్నా ఎంతో శ్రద్ధగా ఈపుస్తకాన్ని రెండుసార్లు చదివాను; కాని ప్రతి మాటనూ ప్రతిభావాన్నీ సంస్కరించేందుకుగాని, సవరించేందుకుగాని నేను పూనుకోలేదు. అలాచేయటం సమంజసంకాదు: గ్రంధకర్త వ్యక్తిత్వాన్ని నిర్బంధించటమౌతుంది. అది ఘోరమైన పని. కాబట్టి

నేనిప్పుడు చెప్ప తగిన మాట ఏమంటే - గ్రంథకర్త చాలవరకు నా అభిప్రాయాలను యథాతథంగా నిర్వచించేందుకుగాను శాయ శక్తులా, జాగరూకతతో ప్రయత్నించాడు. నామనసుకు నచ్చని - నా చెవికి కటువుగా ధ్వనించిన - పలుకేమీ యీ పుస్తకంలో కని పించదు.

అక్కడక్కడ అవసరములని నేను సూచించినసవరణలను అంగీకరించి గ్రంథకర్త సరిదిద్దుకున్నాడు.

"రాజ్యాంగం" అని నామకరణం చేశాడుకదా అని ఈ గ్రంథంలో రచయిత సమస్త వివరాలతో కూడిన రాజ్యాంగ ప్రణాళికను నిర్వచింప బూనుకున్నట్లు పాఠకులు భ్రమించరాదు. గ్రంథకర్త ప్రారంభ ప్రకరణాలలోనే విన్నవించుకున్నాడు. తాను కేవలం నాఆశయాలననుసరించిన రాజ్యాంగస్వరూపాన్ని సూచించే నిమిత్తం ప్రధానసూత్రాలను మాత్రమే ఉదహరిస్తున్నట్టు. ఇంత వరకు జరిగిన భారతదేశ రాజ్యాంగ రచనా ప్రయత్నాలలో శ్రీ అగర్వాల్ కృషి ప్రజ్ఞాన్వితమైనది. తీరికలేక నేను చేయజాలక పోయిన పనిని అతడు శ్రద్ధతో నిర్వహించాడు. గొప్పసంగతి.

కలకత్తావెడుతూ రైల్లో<br>30—11—'45

(సం॥) యమ్. కే. గాంధి



# 1

# ప్రవేశిక

యుద్ధం ముగిసింది. మిత్రరాజ్యాల వారికే సంపూర్ణ విజయమే సిద్ధించింది జర్మనీ - జపాన్ దేశాలు బేషరతుగా దాసోహమన్నవి. కాని శాంతిభద్రతలను నెలకొల్పటంలో మిత్రరాజ్యాలవారు కృతకృత్యులైనారా? ఆ సంగతి ఇంకా కాలము నిర్ణయించవలసియున్నది యుద్ధము యింకా పూర్తిగా ముగియకముందే అట్లాంటిక్ ఛార్టరుకు గోరీకట్టేశారు. అలనాటి నానాజాతి సమితి లాంటిదే మరోరూపంలో ప్రతిష్ఠించారు. పాట్సుడామ్ నివేదిక-వర్సేల్సు సంధి తలదన్నేట్టు వుంది. ఇవేమీ శుభసూచకాలుగా లేవు "యుద్ధసమయంలోకన్నా శాంతికాలంలో మనకు జరిగేదేమీ ఉండదు" అని వెండెల్ విల్కీ అన్నాడు. మిత్రరాజ్యాలవారి చిత్తశుద్ధికి భారతదేశ మొక గీటురాయి వంటిది. "బ్రిటన్ తన సామ్రాజ్య రక్షణకోసం యుద్ధం చేస్తున్న ప్రజాస్వామ్య దేశం" అని పెరల్ బక్ రాసింది. సామ్రాజ్య విధానానికీ ప్రజాస్వామ్యానికీ చుక్కెదురు. అయినా శాంతికీ పొత్తుకలిపి బ్రిటన్ స్వామ్యముఖనీతిని అవలంబిస్తున్నది; అటువంటి బ్రిటిష్ పెద్దలు ఇండియానుంచి మంచితనంగా వైదొలుగుతారనుకోటం వట్టి భ్రమ. అయినా అనతికాలంలోనే భారతదేశం రాజకీయ స్వాతంత్ర్యాన్ని బడయక తప్పదు. పాలకులకది ఎంతకష్టంగావున్నా నిస్సందేహంగా జరిగితీరుతుంది. "బ్రిటిష్‌వారు ఇండియాను తమ పిడికిలిలో బిగియపడుతూన్నకొద్దీ వారి చేతులే నొప్పిపెట్టి, పట్టు సడలిపోయితీరుతుంది" అంటూ హెచ్. జి. వెల్సు తన 'Shape of things to come' అన్న పుస్తకంలో సూచించాడు. గత మూడు సంవత్సరాల్లోనూ బ్రిటిష్‌వారి పిడికిలి తీవ్రంగా బిగుస్తూ ఉంది. ఆపట్టు కాస్తా సడలిపోయే రోజు చేరువలోనే ఉంది ప్రస్తుతపు అంధకారం పటాపంచలై స్వాతంత్ర్య భానూదయం కానున్నది. అనంతములైన ప్రాచీన సంస్కృతి సభ్యతలకు నెలవైన విశాల

భారతానికి స్వాతంత్ర్యం ప్రసాదించకపోతే ప్రపంచశాంతి భద్రతలు గగనకుసుమాలే. భారతీయుల దాస్యజీవితము అంతర్జాతీయ మైత్రి సౌహార్ద్రాలకు గొడ్డలిపెట్టు. స్వరాజ్యము వారి జన్మహక్కు. ఎవరూ కాదనలేరు.

మరి అయితే స్వతంత్రభారతదేశానికి ఎటువంటి రాజ్యాంగం కావాలి? స్విట్జర్లాండు - అమెరికాసంయుక్తరాష్ట్రాలు - రష్యాలవంటి పాశ్చాత్య దేశాలలోని ప్రభుత్వవిధానాలను అనుకరిద్దామా? లేక మన జాతీయసంస్కృతికి, ప్రాచీన సంప్రదాయాలకు అనుగుణమైన ఒక స్వదేశీరాజ్యాంగాన్ని నిర్మాయించుకుందామా? ఎప్పుడో రాజకీయ స్వాతంత్ర్యం మన హస్తగతమైన తరువాత చూచుకుందాములే — అన్న ఉదాసీనభావం కట్టిపెట్టి ఇప్పుడే అవశ్యం ఈ సమస్యను మనము పరిష్కరించుకోవలె

భారతదేశము అతిప్రాచీనమైనది. క్రీస్తు పూర్వమే, యూరప్ —అమెరికాలు అనాగరికస్థితిలో ఉన్నప్పుడే, మన దేశము వివిధ రాజ్యాంగ విధానాలను చవిచూచియున్నది. భౌజ్య స్వరాజ్యము, వైరాజ్యరాష్ట్రికము, ద్వైరాజ్యము, అరాజకము — ఈ మొదలైన ప్రభుత్వవిధానాలు ప్రాచీన భారత దేశంలో అమలునందున్నట్లు కే. పి. జయస్వాల్ తన 'Hindu polity' అన్న పుస్తకంలో తెలియజేస్తున్నాడు. వాటిలో కొన్నింటిని విదేశస్థులు కని విని యెరుగరు. అలాగ వివిధరాజ్యాంగాల పరిణతిని మనదేశం చవిచూచింది. ప్రస్తుత పాశ్చాత్య రాజ్యాంగవిధానాలు ఒక విశిష్టస్థాయిని చుంబించినవేమీ కాదు. అటువంటప్పుడు ఒక విదేశ ప్రభుత్వ పద్ధతిని మనదేశంలో అనుకరించటము సాంఘిక శాస్త్రవిరుద్ధము, దేశానికి అనర్థదాయకమున్నూ. ప్రతిరాజ్యాంగానికీ పరిణామదశలు ఉన్నవి. ప్రజల సంస్కృతికి విభిన్నమైన రాజ్యాంగాన్ని తెచ్చివారినెత్తిపై రుద్దటము అవివేకమైనపని. ఒకదేశంలోని రాజ్యాంగం మరొకదేశంలోనికి దిగుమతి చేయకూడదు. "రాజ్యాంగాలు దిగుమతి సరుకులుకావు" అని సర్ జాన్ మారియట్ అన్నాడు. ప్రతిజాతికీ ఒక ప్రత్యేకమైన సంస్కృతి ఉంటుంది. అది ఆజాతికి ఆత్మవంటిది. ఈ ప్రత్యేక విశిష్టత జాతి జీవనవికాసదశలలో ప్రగతి మార్గాన పరిపుష్టము కావాలి నవనవోన్మీషితమైనస్వాభావిక సంచలనమే జీవము. అంధప్రాయమైన పరానుకరణము నాశహేతువు.

అట్లని పరాయిదేశస్థుల అభ్యుదయమార్గాలయెడ పెడమొగము పెట్టి, వారి మాత్సర్యమును పెంచుకోవలెనని నా ఉపదేశము కాదు సుమండీ! నేను చెప్పదలచినదేమంటే ఏవిషయంలోనూ మనము విదేశీయులముందు

చిన్న బుచ్చుకోవలసిన పని లేదు. ప్రతిదానికీ పశ్చిమాభిముఖులం కాకుండా స్వీయ విజ్ఞానాన్వేషణ పరులము కావాలి. ఇన్నాళ్లనించీ పాశ్చాత్యులను అనుకరించినది చాలు. ఇకనైనా మన సంస్కృతిని, మన సంప్రదాయాలను చూచుకుని గర్విద్దాం.

పూర్వము మనదేశంలో గ్రామపంచాయతీలరూపాన వికేంద్రీకృత ప్రజాస్వామ్య పరిపాలనము శతాబ్దముల తరబడి సాగినది. మేధావంతులు దాన్ని సృష్టించారు. కార్య దీక్షాపరులు అమలుపరచారు. అన్ని గ్రామాల్లోనూ అలాగ స్థానిక స్వపరిపాలన శతాబ్దులుగా జేగీయమానంగా సాగింది. రాజకీయంగా ఎన్ని పడిదుడుకులు వచ్చినా అది చెక్కుచెదరలేదు. ఇప్పటికైనా మనదేశంలో ఒక ఆదర్శ ప్రజాస్వామిక ప్రభుత్వాన్ని నెలకొల్పే నిమిత్తం దానిని ప్రాతిపదికగా గ్రహించవచ్చును. ఆ నాటి పాత విధానాన్నే తూచ తప్పకుండా అమలు పరచవలెనని చెప్పను ప్రస్తుత పరిస్థితులను బట్టి అవసరమని తోచిన మార్పులు, చేర్పులు చేసుకోవచ్చును.

పన్నెండవ శతాబ్దంనాటి భారతదేశ రాజకీయ చరిత్రను 'రవంత పరిశీలిద్దాం. 1909 లోను, 1919 లోను, 1935 లోను బ్రిటిష్ ప్రభుత్వం మనదేశంలో కొన్ని రాజ్యాంగ సంస్కరణలను ప్రవేశపెట్టింది. రాజ్యాంగాలు దిగుమతి సరుకులు కావని తెలిసికూడా బ్రిటిష్ రాజకీయవేత్తలు ఈ సంస్కరణలను ఇంగ్లాండు పద్ధతుల ననుసరించె ప్రవేశపెట్టారు. అవి యెంతమాత్రమూ ప్రజల జాగృతికి అనుబంధించినవికావు. జాతీయ సంస్కృతి విజ్ఞానముల పునరుద్ధరణ అత్యావశ్యకమని మొట్టమొదట గమనించినది గాంధిమహాత్ముడు. 1908 లో ఆయన 'హింద్ స్వరాజ్' అన్న గ్రంథం రాశాడు. అందులో భావి భారత రాజ్యాంగ నిర్మాణానికి ప్రాతిపదిక సూత్రాలను నిర్వచించాడు. తరువాత 1916 లో కాంగ్రెసు - లీగు విధానం తలనూపింది. అది బ్రిటిష్ పార్లమెంటరీ విధానాన్ని పోలినదే. అందులో ప్రత్యేకత యేమీలేదు. అయినా కాంగ్రెసు - లీగు సంయుక్త విధానము హిందూ ముస్లిములకు ఉభయులకూ అంగీకార యోగ్యమైన ప్రభుత్వ నిర్మాణానికి ఒక ప్రయత్నమని చెప్పవచ్చు. 1922 లో గయా కాంగ్రెసు ముగిసిన తరువాత దేశబంధు సి. ఆర్. దాస్, డాక్టరు భగవాన్‌దాస్ - ఇద్దరూ కలిసి ఒక 'స్వరాజ్య నిర్మాణము'ను సూచించారు. అనీబిసెంటు మాత్రం దేశంలోని ప్రముఖనాయకులతో సంప్రదించి 1924 - 25 లో భారతదేశ అధినివేశ ప్రతిపత్తిని ప్రతిపాదించింది. భారతదేశము స్వపరిపాలన గలిగి

బ్రిటీష్ సామ్రాజ్యంలో భాగస్వామిగా ఉండవలెనని ఆమె ఉద్దేశం. కాని భావిభారత రాజ్యాంగ వ్యవస్థకు మన పూర్వకాలంనాటి గ్రామ పంచాయతీల పద్ధతి ఆధారశిలగా ఉండవలెననియే ఆమె సూచించింది. ఆతరువాత 1928 లో సర్వపక్ష సమావేశ నివేదిక – దానినే నెహ్రూ "రిపోర్టు" అనికూడా అంటారు – ప్రచురితమైంది. 1939 లో గాంధీజీ అధ్యర్యాన అయోధ్య సంస్థానంలో ప్రజాస్వామ్య పద్ధతులపై పంచాయతీ రాజ్యము నెలకొన్నది. సర్ తేజబహదూరు సప్రూ అధ్యక్షతను సమావేశమైన 'సామరస్యసభ' (Conciliation Commitee) వారి నివేదిక రాజ్యాంగ రచనా ప్రయత్నములలో కడపటిది.

ఇంతకూ భారతీయ సంప్రదాయ బద్ధమైన రాజ్యాంగ నిర్మాణమే మనకు కావలసియున్నది. దురదృష్ట వశాత్తు చాలమంది నాయకులకు మన ప్రాచీన భారత విజ్ఞాన సంస్థలనుగూర్చి ఎక్కువగా తెలియదు. ఒక్క గాంధీజీ మాత్రం జాతీయ పునరుద్ధరణావశ్యకతను గురించి నొక్కి చెబుతున్నాడు. ఒకనాడు నేను స్వతంత్ర భారత దేశానికి గాను ఒక స్వదేశ రాజ్యాంగ ప్రణాళికను తయారు చేయటముగూర్చి మాట్లాడాను. అందుకు ఆయన హర్షించి, కావలసిన సాయం చేస్తానని వాగ్దానం చేశాడు. నేను దీనికి 'గాంధీ రాజ్యాంగం' అని నామకరణం చేస్తున్నాను. ఎందుచేతనంటే ఈనాడు భారతీయ విజ్ఞాన సంస్కృతులకు చిహ్నమైన వారు ఆయనే. ఈస్వదేశీ రాజ్యాంగానికి సంబంధించిన వివిధ వర్గాలను నేను ఆయనతో చర్చించాను చాలవరకు ఆయన అభిప్రాయాలనే యధాతథంగా సూచిస్తున్నాను. రచనాబాధ్యత అంతా నాది.

ఒక్కసారిగ దేశమంతటా అమలు జరిపేందుకు వీలుగా ఈ ప్రణాళికలో సర్వవివరాలనూ నేను చర్చించటంలేదు. స్వతంత్ర భారతదేశంలో భావి రాజ్యాంగ నిర్మాణానికి దోహదమివ్వగల ప్రధాన ఉద్దేశాలను, ఆశయాలను మాత్రం ఉద్ఘాటిస్తున్నాను. 'వికేంద్రీకృత ప్రజాస్వామ్య విధానము' కేవలమొక ఆశయమేనని అనుకోరాదు. అది సర్వధా ఆచరణ యోగ్యమేనని నొక్కి చెప్పగలను. ఎన్నికలు ముగియగానే ప్రజాపరిషత్తు సమావేశమై భావిభారత రాజ్యాంగ నిర్ణయము చేయవలసి యున్నది ఇట్టి తరుణంలో ఈ గ్రంథము మనదేశనాయకుల ఆలోచనలకు దోహదం ఇచ్చి – స్వసంప్రదాయానుగుణమైన రాజ్యాంగ నిర్మాణావశ్యకతను వారు గుర్తించ గలిగినట్లయితే... నా యీ కృషి ఫలించినట్లే.

# 2

# ప్రాథమిక సూత్రాలు

ఒకానొక ఆదర్శ ప్రభుత్వనిర్మాణానికి సంబంధించిన సర్వాంగా-లనూ నేనిక్కడ వివరించదలచుకోలేదు. కాని ఎట్టి ప్రభుత్వమైనా నాలుగు కాలాలపాటు నిల్చి ఉండాలంటే మనం గమనించవలసిన కొన్ని ప్రాతిపదిక సూత్రాలు ఉన్నవి. వాటిని అవగతం చేసుకోకుండా రాజ్యాంగ ప్రణాళికా రచనకుపూనుకోవటం అర్థరహితమైనపని; నిష్ప్రయోజనమౌతుంది.

కాలాన్ని బట్టి, దేశాన్ని బట్టి ఆయా ప్రభుత్వ విధానాల ఔత్కృష్ట్యాన్ని నిర్ణయించవలసి ఉంటుంది. ఎట్టి రాజ్యాంగమైనా పూర్వసంప్రదాయా-లనూ, ప్రస్తుత పరిస్థితులనూ అనుసరించి ఉండవలె. "పరిపాలనా విధులను సక్రమంగా నిర్వర్తించ గలిగితే ఆరాజ్యాంగం ఆనాటికి నిరుపమమైనదే నని చెప్పవచ్చును" వ్యక్తి జీవన ప్రమాణాన్ని సాధ్యమైనంత వరకు హెచ్చించటమే ప్రభుత్వ ప్రధాన కర్తవ్యం, "పరిపాలన బాగా ఉంటే ప్రజలు హాయిగా సుఖంగా ఉంటారు" అని అరిస్టాటిల్ అంటాడు. ఒకానొక రాజ్యాంగంలో కొన్ని ప్రత్యేకతలు, విశిష్టతలు ఉండవచ్చును. కాని "దాని మంచి చెడ్డలను ప్రజల జీవన పరిస్థితులే చెబుతాయి" అన్ని రాజ్యాంగాల ప్రధానఆశయం ఒక్కటే, కాని దేశకాల పరిస్థితులను బట్టి వాటి స్వరూపాలు విభిన్నంగా ఉంటాయి.

## ప్రభుత్వాశయం

'ప్రభుత్వము యొక్క ఆశయం ఎట్టిదిగా ఉండాలి?' — అన్న ప్రశ్న ఇరుసుగా అన్ని దేశాల రాజకీయాలూ పరిభ్రమిస్తూ ఉంటాయి. గ్రీకులకు ప్రభుత్వమొక ఉత్కృష్టమైన సంస్థ. నదిసముద్రం వైపు ప్రవహిస్తుంది. అలాగే

వ్యక్తులందరి కృషి ప్రభుత్వ సంస్థకు అభిముఖంగా సాగాలి ఏథీనియనులు పౌరసత్వపు హక్కులను ఎంతో గౌరవ ప్రదమైనదిగా పరిగణిస్తారు; "దేశం లోని సాంఘిక రాజకీయ ఆర్థిక అభ్యుదయానికి పట్నమనేది ఒక చిహ్నం" మని వారి భావన. ప్రభుత్వంలో ప్రతివ్యక్తికీ అర్హమైన స్థానం ఉండవలెననీ, అతడు తన విధ్యుక్తాన్ని యథావిధిగా నిర్వర్తించవలెననీ 'ప్లాటో' అభిప్రాయం. సర్వ సమానత్వాన్ని పాటిస్తూ, ప్రజలజీవితాన్ని సౌఖ్యావహము చేయటమే ప్రభుత్వపు ముఖ్యకర్తవ్యమని 'అరిస్టాటిల్' నిర్వాచనము. రోమనులు ప్రభుత్వాశయములను గూర్చి సిద్ధాంతీకరించినట్టులేదు. వారు ఎల్లప్పుడూ తమ సామ్రాజ్య విస్తరణలోనే నిమగ్నులై ఉండినారు ప్రభుత్వమనేది క్రీస్తుమత రక్షణకోసం భగవంతుడు ఉపయోగించే ఉపకరణమని మధ్యయుగముల లోని కొందరు ఫాదరీలు రాశారు. శాంతిని స్థాపించి ఆస్తిపాస్తులను రక్షించటము ప్రభుత్వకర్తవ్యమని 'హాబ్సు' చెబుతున్నాడు. 'లాక్'దృష్టిలో ప్రజల ప్రాణాల్నీ, హక్కులనూ, ఆస్తులనూ కాపాడటమే ప్రభుత్వకర్తవ్యం. ప్రభుత్వమంటే ప్రజాభీష్టములను నెరవేర్చగలందులకు ఏర్పడిన సంస్థ - అంటాడు 'రూసో.' ప్రభుత్వం దైవంతో సమానమని 'హెగెల్' అభిప్రాయం. అధిక సంఖ్యాక ప్రజలకు అధికలాభాలను చేకూర్చునదే ప్రభుత్వం - అని 'బెంథామ్' అభిప్రాయం. 'హెర్బర్టు స్పెన్సర్'దృష్టిలో ప్రభుత్వము పలువురు భాగస్వాములతో పరస్పర సహాయార్థమై నెలకొన్న ఒక భీమాకంపెనీ. వ్యక్తిస్వాతంత్ర్యాన్ని రక్షించటమే ప్రభుత్వ ప్రధాన విధియని 'జాన్ స్టూఆర్టు మిల్' సూత్రీకరించాడు. వర్గరహిత సాంఘిక వ్యవస్థను స్థాపించటము ప్రభుత్వపు విధియని 'మార్క్సు' అన్నాడు. "ప్రజల జీవితాన్ని ఉన్నత స్థాయికి గొనిపోగల ఉదారమైన సంస్థ ప్రభుత్వం - అని 'లాస్కీ' అంటున్నాడు. ఏదో ఒక వర్గానికే గాక దేశంలోని సర్వ ప్రజలకూ ప్రభుత్వము చేతనైనంతగా సుఖశాంతులను చేకూర్చి పెట్టవలె - అని 'బెర్నార్డుషా' అభిప్రాయ పడుతున్నాడు. "ప్రపంచమంతకూ ఒకే పరిపాలన సంస్థయేర్పడి, మానవుల హక్కులను గుర్తించే చట్టములతో, ప్రతివ్యక్తి సుఖంగా, ఆరోగ్యంగా, స్వేచ్ఛగా జీవించేట్టు పరిస్థితులు మారాలి" - అని 'వెల్సు' పండితుని ఆశయం ?

రామాయణము, భారతము, మనుస్మృతి, కౌటిల్యుని అర్థశాస్త్రము, శుక్రాచార్యుని నీతిసారము - ఈ గ్రంథాల్లో భారతీయుల రాజకీయ దృక్పథం మన కర్థమౌతుంది. రామరాజ్యం ఎంత ఆదర్శ ప్రాయమైనదో, అందు ప్రజ

లెంత సుఖంగా, హాయిగా సంపద్వంతులై జీవించారో రామాయణ కావ్యం చెబుతున్నది. మహాభారత శాంతి పర్వంలో భీష్ముడు ప్రభుత్వ విధులను కొన్ని వివరించాడు. ప్రజలు తమ తమ విధ్యుక్తధర్మాలను సక్రమంగా నెరవేర్చుకొంటూ శాంతంగా, సుఖంగా జీవయాత్ర గడుపుకునేలాగున ప్రభుత్వం సాగాలి అని ఆయన ఉపదేశించాడు. ప్రజల సుఖశాంతులకు ప్రభుత్వము ఉత్తరదాత అని కౌటిల్యుడు నొక్కి చెప్పాడు. "ప్రజల సుఖమే తన సుఖముగా, ప్రజల క్షేమమే తన క్షేమముగా రాజు భావించవలెను". శుక్రనీతిలో కూడా 'రాజు ప్రజల రక్షకుడు, పోషణకర్త' అని సిద్ధాంతీకృతమైనది. ప్రజలు ఎవరి ధర్మాలను వారు అనుష్ఠించుకుంటూ, పరుల ధర్మాలకు అడ్డు రాకుండా సురక్షితంగా జీవించగలందులకు రాజు తన రాజ్యాంగమును సాగించుకోవలెను.

## నిరంకుశప్రభుత్వము : వ్యక్తిస్వాతంత్ర్యము.

ప్రభుత్వాశయాన్నిగూర్చి పాశ్చాత్యుల అభిప్రాయాలనూ, భారతీయుల అభిప్రాయాలనూ క్రోడీకరించి చూచాం. ఇందునుగూర్చి రెండువిధములైన దృక్పథాలు కనిపిస్తున్నాయి. కొందరు పరిపాలనా సంస్థకే ప్రాధాన్యం ఇస్తున్నారు. వారి చేతుల్లో వ్యక్తిస్వాతంత్ర్యం దెబ్బతింటున్నది. ప్రభుత్వాధికార యంత్రంలో ప్రజలు అస్వతంత్రపు ఉపకారణాలు మాత్రమే. ఇట్టి విధానము నియంతృత్వ—నిరంకుశ పాలనలకు దారితీస్తుంది. ఇక రెండవ తరగతివారి దృష్టిలో వ్యక్తిస్వాతంత్ర్యాభ్యుదయాలకే ప్రాముఖ్యం ఉంది. ప్రభుత్వం వ్యక్తిస్వత్వాలను సంరక్షించవలె 'కౌంట్ కాడెన్ హోవ్ కాలర్గి' అనునాతడు ఈరెండు రకములదృక్పథాలకూ తన 'Totalitarian state-against man' అన్న గ్రంథంలో స్పార్టా ఏథెన్సు రాజ్యాలను ఉదాహరణలుగా తీసుకున్నాడు. 'స్పార్టాలో ప్రభుత్వంకోసం వ్యక్తి పాటుపడ్డాడు. ఏథెన్సులో వ్యక్తికోసం ప్రభుత్వం శ్రమించినది' ఏది ఏలాగున్నా ఈరెండు విధానాలనూ సమన్వయం చేయగల రాజ్యాంగమే క్షేమకరమైనది

ప్రభుత్వాధికారానికీ, వ్యక్తిస్వాతంత్ర్యానికీ సమన్వయం కుదరవలె. వ్యక్తిస్వాతంత్ర్యం ఆవసరమే. రాజ్యం మొత్తంమీద సమిష్టి అభ్యుదయమూ కావలసినదే. ప్రభుత్వము ఈ రెంటినీ సాధించ వలసియున్నది. ప్రతివ్యక్తి ప్రభుత్వముపట్ల తన ధర్మాన్ని నిర్వర్తించాలి. ప్రభుత్వం అతని హక్కులను పాటించి, అతని అభ్యుదయానికి పూర్తిగా తోడ్పడాలి. కాని "వ్యక్తిస్వా

తంత్ర్యానికి ఒకపరిమితి ఉండాలి, అది హద్దుమీరి పోగూడదు"—అని ప్రొఫెసర్ 'టానీ' అంటాడు.

"హద్దుమీరిన వ్యక్తిస్వాతంత్ర్యం అరాజకానికి కారణమౌతుంది? సమిష్టి అభ్యుదయంకోసం ప్రతివాడూ తన హక్కులను తగ్గించుకోవాలి—" అని ఏ. జి. గార్డినర్ అంటున్నాడు ఇతరులతో ఏవిధమైన సంబంధమూ లేని సొంత వ్యవహారాల్లో మనం ఎన్ని పోకిళ్లుపోయినా పరవాలేదు. గోను తోడుక్కొని, విగ్గు తగిలించుకుని, వెంట్రుకలు పెరబోసుకుని రాజవీధిని నడచి పోవాలని నేను కోరిక పడతాననుకోండి. ఎవరు అభ్యంతర పెడతారు? నన్ను చూచి నవ్వుకునే అధికారం మీకు ఉంది. మీ పరిహాసాన్ని నిర్లక్ష్యం చేయగల అధికారం నాకూ ఉంది వెంట్రుకలకు రంగువేసు కోవాలనుకుంటే గాని, పొడుగాటి టోపీ ధరించాలనుకుంటేగాని ఈ మొదలైన విషయాల్లో నాయిష్టప్రకారం నేను నడుచుకుంటాను. ఇతరుల అనుమతితో పనిలేదు" కాని ఇతరులతో సంబంధం ఉన్నవ్యవహారాల్లో మాత్రం అవవ్వలు ఉండవు, ఇతరుల యిష్టాయిష్టాలనుపట్టిమన అభిరుచులు రూపొందవలె. ప్రపంచంలో మనలాంటి వాళ్లు ఎందరో ఉన్నారు. వారందరి సౌకర్యం కోసం మన సౌకర్యాలను తగ్గించుకోవలసి ఉంటుంది

సంపూర్ణ వ్యక్తిస్వాతంత్ర్యం ఆధునిక ప్రపంచంలో అంతరించి పోయింది. అది మళ్లీ తలయెత్తజాలదు ప్రభుత్వాధికారానికి వ్యక్తి అభిరుచులుబలికావటం అవాంఛనీయం "ప్రజాక్షేమమే ఆశయంగాకృషి చేయండి" అంటాడు 'కాంటు'. ఏప్రభుత్వమైనా తననిరంకుశ విధానంతో వ్యక్తులనుఅణగ ద్రొక్కేయెడల అది మానవజాతియెడల మహాపచార మన్నమాట. కాగా పాలకుడు, పాలితుడు ఇద్దరూ అధః పతితులు కాక తప్పదు. నిరంకుశపాలనలో వ్యక్తులకు స్థానంలేదు అట్టినిరంకుశ ప్రభుత్వంలో అది ఫాసిస్టు రాజ్యమైనా సోషలిస్టురాజ్యమైనా అధికారమంతా ఏకొద్దిమంది చేతుల్లోనో ఉంటుంది; మిగిలిన లక్షలాదిప్రజల భవిష్యత్తు అంతా వారి అధీనంలోనే ఉంటుంది. వారు ఉదారులేకావచ్చు, సదుద్దేశాలు కలవారై ఉండవచ్చు అయినావారిని వొదిలించుకుంటేనేగాని విధం బాగుపడదు. "ఒక రిద్దరు మహావ్యక్తు లనబడే వారి చేతులమీదుగా ప్రభుత్వం సాగిపోతూ ఉండే రాజ్యంలో నాగరకత వర్ధిల్లదు." హిట్లరు - ముసోలినీలు తారాజువ్వలవలె యెగిరి, ఉల్కలవలె పడిపోయారు. దురధికార పూరితమైన నియంతృత్వాలు నిష్ప్రయోజనములని

వారి అంత్యపతనము రుజువు చేస్తున్నది. హిట్లరు ఈనాడు బ్రతికివున్నా, మరణించినా— అతని గాథ అంతా ఒక కట్టు కథగా పర్యవసించింది.

## రష్యాలో ప్రజాస్వామ్యం.

రష్యాలో 'కూలీరాజ్య' మంటూ ఒక రాజ్యాంగ వ్యవస్థ ఏర్పడింది. వర్గరహిత - సర్వస్వామ్య సంకలిత సాంఘిక వ్యవస్థా నిర్మాణమే మార్క్సు పండితుని ఆశయం. కాని అది సిద్ధించవలెనంటే నిర్దాక్షిణ్యంగా...బల ప్రయోగం చేసియైనా...అధికారం చలాయించి ప్రజాస్వామ్యాన్ని లొంగదీసుకోవలసి ఉంటుంది. ఎప్పుడో చిట్టచివరకు ప్రభుత్వాధికారం అంతరించి ప్రజలే తమ్ముతాము పాలించుకో గలుగుతారని ఆశ. కాని ప్రొఫెసర్ ఆల్డస్ హక్స్లి చెప్పినట్లు "అలాంటి తీవ్రనిరంకుశ కేంద్ర నియంతృత్వము బైటినించి సంభవించే యుద్ధం మూలంగాగాని, అంతర్విప్లవంవల్ల గాని భిన్నాభిన్నము కావచ్చును." "రష్యాలోని కూలీరాజ్యము కూలీల పైనే నిరంకుశ నియంతృత్వంగా పరిణమించవచ్చును" అని జాన్ గంథర్ భయపడు తున్నాడు. 'Giude to the philosophy of Morals and politics' అన్న గ్రంథంలో ప్రొఫెసర్ జోడ్ ఏమి రాస్తున్నాడంటే— "చరిత్ర పరిశీలించి నట్టయితే నియంతృత్వాధికారాలు నానాటికీ తీవ్రరూపం దాలుస్తాయేగాని సన్నగిలిపోయే అవకాశం ఎక్కడా కనిపించలేదు. వాటి స్వభావమే అట్టిది మరి! తమ్ము విమర్శించే వారిపై విరుచుకు పడతాయి. ఆధునిక ప్రపంచంలోని రాజకీయ సంఘటనలు ఈ సత్యాన్నే నిరూపిస్తున్నవి. కమ్యూనిజం ఆశయానికీ, మనం ప్రత్యక్షంగా చూస్తున్నదానికీ కావలసినంత వ్యత్యాసముంది. ఏనాటికైనా నియంతృత్వాధికారం ఉడిగి, ప్రజాస్వాతంత్ర్యం లభించవలెననికదా కమ్యూనిజంలోని ఆశయం, కాని చరిత్ర అందుకు విరుద్ధంగా సాక్ష్యమిస్తున్నది. మన తత్వశాస్త్రమైనాదాన్ని సమర్థించలేకనే పోతున్నది".

"రాజ్యాంగాన్ని కేంద్రీకృతం చేసినప్పుడు అధికారం స్వల్ప సంఖ్యాకవర్గం చేతిలో ఉండక తప్పదు" - అని ప్రొఫెసర్ గిన్స్బర్గ్ తన 'Psychology of Society' అన్న గ్రంథంలో సూచించాడు. ఆచార్య వినోభా భావే కూడా అదే అభిప్రాయ పడుతున్నాడు: "కేంద్రాధికారం కేపిటలిస్టులదైనా, సోషలిస్టులదైనా...నిరంకుశము, హింసాత్మకము, దమన నీత్యాను సరణము అయితీరుతుంది."

### ప్రజా స్వామ్యావశ్యకత

కాబట్టి ప్రపంచానికి ప్రజాస్వామ్యమే గత్యంతరం. వివిధవ్యక్తుల ప్రత్యేకాభివృద్ధులకు దోహదం ఇస్తూ, సరియైన పద్ధతులమీద నిర్మితమైన రాజ్యాంగమే ప్రజాస్వామ్య ప్రభుత్వమంటేను. ప్రజాస్వామ్య విధానము వ్యక్తి హక్కులను మన్నిస్తుంది; ప్రతివ్యక్తీ సమిష్టి సంఘాభ్యుదయానికి అవశ్యం నిర్వర్తించ వలసిన బాధ్యతలనుకూడా ప్రతిపాదిస్తుంది. "ప్రజా క్షేమంకోసం, ప్రజలే కొనసాగించే ప్రజాప్రభుత్వమే ప్రజాస్వామ్య విధానం" – అని లింకోలన్ నిర్వచించాడు. శ్రీమతి ఎలినార్ రూజ్‌వెల్టు అన్నట్లు ప్రజాస్వామ్య విధానము పవిత్రమైనది, నైతికమైనది, ప్రజలలో పరస్పర గౌరవ – సుహృద్భావాల పెంపుదల ఆశయంగా కలది. "మన విభూతి పరుల విభూతికి సాయపడినప్పుడే అది సార్థకము కాగలదు"

ప్లాటో ప్రజాసామ్యవాదికాడు. "ప్రజాసామ్య రాజ్యాంగం సోమరుల, భోగపరాయణుల అధీనంలో చిక్కుపడడానికి ఆస్కారం ఉంది" అని ఆయన అభిప్రాయం. అట్టి రాజ్యాంగంకన్నా బుద్ధిమంతుడైన రాజు యొక్క వివేకవంతమగు నిరంకుశపాలనమే మంచిది – అని ఆయన ఉద్దేశం. సంపూర్ణ ప్రజాస్వామ్యము మానవజాతిలో అసంభవమనీ, "మానవులంతా దేవతాసమానులైనప్పుడే అది సాధ్యంకాగలదనీ రూసో అంటాడు. ప్రజాస్వామ్యము మంచిదీకాదు, చెడ్డదీకాదు అంటూ 'డిటాక్ వెల్లీ' తేల్చివేశాడు. ప్రజాస్వామ్యంలో అభ్యుదయం ఉండనేరదు అని 'హెన్రీమైన్' వాదన. "ప్రజలు ఎద్దులతో సమానం వాళ్లకు కాడి, ముల్లుకర్ర, గడ్డివాము కావాలి" అంటూ ప్రజాస్వామ్య రాజ్యాంగాన్ని తృణీకరించాడు వాల్టేర్. "లింకోలన్ ఇచ్చిన ప్రజాస్వామ్య నిర్వచనము అర్థశూన్యమైనది ప్రజలెప్పుడూ ప్రభుత్వాలను నిరోధించినవారే, వీలుచిక్కితే తిరుగుబాట్లు చేసినవారే. వారికి పరిపాలనా చాకచక్యం యేమియేడిసింది?" అని అడుగుతున్నాడు బెర్నార్డుషా.

ఎవరేమిఅన్నా వ్యక్తిసమిష్టి హక్కులను సమన్వయం చేయజాలినది ప్రజాస్వామ్య రాజ్యాంగమేనని ఒప్పుకోవలసిందే అన్నిదేశాలకూ, అన్నికాలాలకూ ఒకే రాజ్యాంగం సరిపోదని ఇతఃపూర్వం చెప్పాను కాన ప్రజాజీవితము అభ్యుదయమార్గాన సాగిపోవుటకు ప్రజాస్వామ్య విధానము మిక్కిలి తోడ్పడగలదని విశ్వసించవచ్చును: "ప్రజలంతా సమాన హోదాలో రాజ్యాంగవ్యవస్థా భాగస్వాములైనప్పుడు ప్రతివ్యక్తీ పరితుష్టి చెందినట్టే;

సంఘానికంతకూ క్షేమము చేకూరినట్లే" అని లార్డుబ్రైస్ సూక్తి. ప్రొఫెసర్ లెస్కార్డు అన్నట్లు "ప్రజాస్వామ్యము రాజకీయంగానేగాక సాంఘికంగా కూడా ఉత్కృష్టమైనది. నిర్వర్తించవలసిన బాధ్యతలు ఎన్నివున్నాయో, పడవలసిన శ్రమా అంత వున్నది."

ప్రజాస్వామ్యవిధానము వ్యక్తిగౌరవాన్ని మన్నిస్తుంది. "అదివ్యక్తిత్వ పరిపూర్ణ వికాసానికి సాయపడుతుంది. అని మిసెస్‌వెబ్ అంటున్నది " ఏ యితర రాజ్యాంగమూ ప్రజాస్వామ్య విధానమువలె జాతీయ నైతికశక్తులను పెంపొందించలేదు" అని జాన్‌స్టూఅర్టుమిల్ అంటాడు జాతీయవిద్యావిధానమే ఉత్కృష్టమైనది. కాగా విద్యావిషయికంగానైనా ప్రజాస్వామ్యానిదే అగ్రస్థానం ప్రజల్లో రాజకీయ విజ్ఞానాన్ని ఇతరవిధానాల కన్న మిన్నగా పోషించేదీ అదే.

మంచిలో కూడా ఏదో చెడు ఉండటం సహజం. ప్రజాస్వామ్య విధానంలో కూడా ప్రస్తుతం చాలా లోపాలున్నాయి. అది ఇప్పుడు పరిణామ దశలో ఉంది. పరిపూర్ణత ఇంకా సిద్ధించలేదు; సంధిదశలో ఉన్నదని చెప్పవచ్చు. ఇందునుగూర్చి ఇంకా వివరాలను ముమ్ముందు చర్చిద్దాం.



# 3

# ప్రజాస్వామ్యము : సంధిదశ

ప్రపంచంలో ప్రజాస్వామ్య వ్యవస్థను సురక్షితంచేసే నిమిత్తమే మిత్రరాజ్యాలవారు ప్రథమ సంగ్రామంలో పాల్గొన్నామన్నారు. యుద్ధానంతర పరిస్థితులందుకు విరుద్ధంగా పరిణమించాయి. వర్సైల్సుసంధి ప్రపంచ శాంతిని స్థాపించ లేకపోయింది; పైగా మరో భయంకర యుద్ధానికి పునాదులు వేసింది. యుద్ధానంతర వ్యవస్థలో ప్రజాస్వామ్య సంరక్షణమాట దేవుడెరుగును...అసలు అది నిలువ నీడే లేకుండాపోయే పరిస్థితులేర్పడినవి. ఒక ప్రజాస్వామ్యయుగాన్ని స్థాపించవలెనన్న అధికోత్సాహపూరిత-హింసాత్మక-ఉద్యమాల ఫలితంగా యూరప్‌లో నియంతృత్వాలు చెలరేగినవి ఈనియంతృత్వాలతోడి సంఘర్షణలో ప్రజారాజ్యాలుకూడా తమ ఆశయాలను విస్మరించాయి.

అట్లాంటిక్ చార్టరులో ద్వితీయ ప్రపంచ యుద్ధాశయాలను నిర్వచిస్తూ "అన్ని జాతులవారి హక్కులను మన్నించేందుకున్నూ, వారివారి యిష్టానుగతమైన రాజ్యాంగాన్ని వారే నిర్ణయించుకో గలందులకున్నూ ఒప్పుకున్నారు. కాని యుద్ధం యింకా సాగుతుండగానే అగ్రరాజ్యాలవారు అట్లాంటిక్ చార్టరుకు అట్లాంటిక్ మహాసముద్రంలో గోరీ కట్టేసి తమ నిజాయితీని బైటపెట్టినందుకు వారికి 'నమోనమః'. 'వి' అను అక్షరము విజయచిహ్నముగా వ్యవహృతము కావటమెక్కడోటే గత యుద్ధాశయముగా కనిపిస్తున్నది.

సార్వకాలికంగా తామే అగ్రశ్రేష్ఠులుగా వ్యవహరించవలెనన్న ఆశకూడు అగ్రరాజ్యాలవారికి పూర్తిగా ఉంది. ఇదే శాన్‌ఫ్రాన్సిస్కో సమావేశంలో తేలిన ముఖ్యాంశం. వారు స్వాతంత్ర్యాన్ని గురించీ, ప్రజాస్వామ్యాన్ని గురించీ శుష్కప్రియాలు బాగానే చెప్పగలరు. 'స్వపరిపాలనాహ్వా

స్వాతంత్ర్యానికీ అద్భుతమైన భేదాలు కల్పించి చిన్న రాజ్యాలవారిని చక్కగా మోసం చెయ్యగలరు. నిజానికి ఇటలీ-జర్మనీ-జపాన్ దేశాలలో ఫాసిస్టు ప్రభుత్వాలు అడుగంటిపోయాయి: కాని ఫాసిస్టు తత్వము మాత్రము పూర్వంకన్న విజృంభణగతిలో ఉన్నట్టే తోస్తుంది. 'యుద్ధము ప్రజాస్వామ్య పరివ్యాప్తికి అవకాశాన్ని కల్పిస్తుంది. అంతేగాని ఆ అవకాశాన్ని ప్రపంచం వినియోగించుకో గలుగుతుందని నమ్మకంగా చెప్పలేము" — అన్నాడు ప్రొఫెసర్ లాస్కీ. ఇటీవల విజయంవల్ల మరొకసారి లభించిన అవకాశం మంటగలసి పోయినట్టే. "పశ్చిమఖండంలో ప్రజాప్రభుత్వాలు లేవు. ఉన్నవన్నీ నిరంకుశ-వర్గ ప్రభుత్వాలే. ఫాసిస్టుతత్వ పూరితాలే" — అన్నాడు బెర్నార్డుషా ప్రస్తుతం ఇంగ్లాండులోని లేబరు ప్రభుత్వంకూడా అలాంటిదే. ప్రజాస్వామ్యానికీ, సామ్రాజ్యతత్వానికీ పొత్తుఎలా కుదురుతుంది చెప్పండి. చర్చిల్ గారి ఫాసిజం పోయింది, లేబరు ప్రభుత్వుల నియంతృత్వం వచ్చింది అమెరికా సంయుక్తరాష్ట్రాలవారు బ్రిటిషర్లకు చిన్నతమ్ముళ్లు; అయినా వారికంటే తెలివైనవారు. అందుచేత వారిది పైకి బట్టబయలుగా కనిపించని సామ్రాజ్యతత్వం. 'చతుర్విధ స్వాతంత్ర్యాలంటూ' గొప్పగా శుష్క-ప్రియాలు చెబుతారు. సోవియట్ రష్యా పైయుద్ధరినీ మించిన జిత్తుల మారి. ఘటోత్కజ బలంతో విజృంభించి ప్రపంచమంతా సోషలిస్టుమయం చెయ్యాలని చూస్తోంది. ద్వితీయ ప్రపంచ సంగ్రామానంతరమైనా ప్రజాస్వామ్య పరివ్యాప్తికి సదవకాశాలు కనిపించటంలేదు. ఈనాటి మిత్రరాజ్యాలు రేపు శత్రు రాజ్యాలుగా పరిణమించేట్టయితే ప్రపంచ వినాశనమే దాని ఫలితం. "ప్రపంచ పరిస్థితులు తృతీయ యుద్ధాభిముఖంగా నడుస్తున్నాయి సుమండీ" - అంటూ బ్రిటిష్ లేబరు పత్రిక డైలీ హెరాల్డు నిర్మొగమాటంగా హెచ్చరిక చేసింది అప్పుడే.

## పెట్టుబడిదారీ ప్రజాస్వామ్యం

ప్రొఫెసర్ టానీ చెప్పినట్టు పెటుబడిదారీ విధానమే రాజకీయంగానూ, ఆర్థికంగానూ అనేక అనర్థాలకు ఆటపట్టు. పెట్టుబడిదారు (Capitalist), తన 'మనీపర్సు'కు ముప్పం రానంత కాలమూ ఔదార్యం చూపుతాడు. తియ్యగా మాటాడుతాడు; ప్రజలకు అవసరమైన సాంఘిక సంస్కరణలను, రాజకీయ స్వాతంత్ర్యాన్నీ ప్రసాదించేందుకు అంగీకరిస్తాడు. కాని ప్రజల రాజకీయాధికారం పెట్టుబడిదారీ విధానాన్ని తలక్రిందుచేసేట్టయితే ఒప్పుకోడు. దాని ఉనికికి ముప్పం వచ్చేట్టుంటే నిర్దాక్షిణ్యంగా

వ్యవహరించటానికి వెనుదీయడు. ప్రజలు తనకిష్టమైన పాటపాడుతూన్నంత సేపే గమ్మున ఊరుకుంటాడు. వ్యతిరేక శృతివినిపిస్తేమాత్రం తన పూర్వ గౌరవాన్ని, ప్రస్తుత సౌఖ్యాల్ని రక్షించుకునే నిమిత్తం హింసాత్మకంగా ప్రవర్తించగలడు. ఫాసిజం అంటే యేమిటిమరి? "గాలెత్తిపోయిన పాత విధానాన్నే అంటిపెట్టుకుని, హింసాత్మకంగానైనా సరే దాన్నే పోషించు కుంటూ, భవిష్యత్తునుగూడా తమ గుప్పెటలో పెట్టుకోవాలనిచూచే అధి కార శక్తులకు ధిక్కారమే ఫాసిజం అంటేను"—అని ప్రొఫెసర్ లాస్కీ అంటాడు. అంటే గత్యంతరంలేక ఎదురు తిరిగిన పెట్టుబడిదారీ ప్రజాస్వా మ్యమే ఫాసిజమన్నమాట. నిజానికి పెట్టుబడిదారీ విధానము, ప్రజాస్వామ్య విధానమూ పరస్పర విరుద్ధములు. పెట్టుబడిదారీ విధానంలో ఉత్పత్తి యంత్రాగార యజమానికి లాభము సంక్రమింపజేయటమే ప్రధాన లక్ష్యం ప్రజా స్వామ్య విధానములో ప్రభుత్వాధికారము సమిష్టి ప్రజాక్షేమానికి వినియోగ పడేలాగు ప్రయత్నించగల రాజకీయమైన హక్కు ప్రతిపౌరునికి ఉంటుంది. కొంతకాలంవరకూ ఈ రెండు విధానాలూ చెట్టాపట్టాలు వేసుకొని చెలిమి తోనే సాగివచ్చినవి. కాని గతయుద్ధానంతరం పరిస్థితులు మారినవి. ఎక్కడ చూచినా నిరుద్యోగ సమస్యే. దేశసంపద సక్రమంగా పంపకం కాకపోవ టంచేత ఒకవంక సకల భోగాలు తాండవిస్తోంటే మరోవంక దరిద్రదేవత వికటాట్టహాసంచేసింది. సామాన్యప్రజలు తమ ఆర్థికసదుపాయాల కోసం ఉన్న రాజకీయాధికారాన్ని వినియోగించుకో ప్రయత్నించారు. ఇది ధనిక వర్గాల ప్రత్యేక ఆర్థిక హక్కులకు ధిక్కారమైంది. తత్ఫలితగా ఫాసిస్టు నియం తృత్వాలు, నిరంకుశ రాజ్యాంగాలు స్థాపితములైనవి. బ్రిటన్‌లోగాని, అమె రికాలోగాని ప్రజాస్వామ్యము లనబడుతూన్న రాజ్యాంగాల్లోకూడా ఫాసిస్టు తత్వమే అంతర్వాహిని. ఎవరు ఎంత యెక్కువఫాసిస్టులా? అన్న విషయంలో మాత్రమే బ్రిటన్ జర్మనీలకు వెనుకా, ముందూ ఉంటాయి. ఫాసిస్టు తత్వం జాస్తిగా ఉన్న జర్మనీ–ఇటలీ వంటి దేశాల్లో నియంతృ త్వాలు బలిసిపోయాయి.

ప్రజాస్వామ్యము లనబడుతూన్న రాజ్యాల్లో పెట్టుబడిదారీ విధానానికి చురుకైన దెబ్బేకాయలేమీ తగలటంలేదుగదా ! అందుచేత ధనికవర్గాలవారు శాంతంగా సహించివున్నారు. కాని ఏదేశంలోనైనా ధనిక దరిద్ర విభేదాలు ఉన్నంతకాలమూ నిజమైన ప్రజాస్వామ్యము

న్నాలకొనిశేదన్నమాటే “సంఘం ఆర్థికంగా వివిధతగగతులక్రింద చీలివున్నంత కాలమూ రాజ్యాంగము ఉత్పత్తియంత్రాగార యజమానులకు లోబడేఉండ వలసివస్తుంది” కనుక ఆర్థిక వ్యవస్థ మారితేనే తప్ప సంఘంకూడామారదు. మారనిపక్షంలో ప్రజాస్వామ్యము పెట్టుబడిదారీ విధానానికి చెలికత్తెగానే ఉండవలసిందే. ధనికవర్గాలవారే ప్రత్యక్షంగానో, పరోక్షంగానో శాసన సభలనూ, పత్రికలనూ, ప్రచురణశాలలనూ, విద్యాసంస్థలనూ, తదితర ప్రచారోపకరణాలనూ తమ తమ యాజమాయిషీలో ఉంచుకుంటారు. ప్రభుత్వాన్ని తమ స్వార్థంకోసం వినియోగించుకుంటారు. ఇలాగ ప్రజాస్వామ్యము కాస్తా వర్గ పరిపాలనగా దిగజారి ఊరుకుంటుంది “ప్రజాస్వామ్యానికి ధనికవర్గము తీరని, ఆరని శత్రువు” — అని లార్డు బ్రైస్ అభిప్రాయం. “ఆ శత్రువు మిక్కిలి భయంకరుడుకూడాను. రహస్యంగా బుజ్జగించో, మోసగించో బలప్రయోగం లేకుండానే తన పని నెరవేర్చుకుంటాడు”

## డెమాక్రసీ : మొబాక్రసీ

ప్రజాసామ్య విధానంలో ధనికవర్గీయుల ప్రాభవం అలాంటిది, పైగా ఎన్నికల పద్ధతికూడా లోపభూయిష్టంగానే ఉంది. పెద్ద పెద్ద నియోజక వర్గాలలో వోటర్లకూ, అభ్యర్థులకూ సన్నిహిత సంబంధం ఉండటానికి అవకాశంలేదు. అందుచేత ఎన్నికల ప్రచారం ఆవశ్యకమైంది. ఆ తదంగమంతా మన మెరిగినదే. ఎన్నికల మీటింగులన్నీ దోషపూరితములు, అసత్యాములు అని బెర్నార్డుషా అంటాడు. అభ్యర్థిగా నిల్చినవాడు ఎంతకుశాగ్రచిత్తుడైనా ఆ సమయాన మతిపోయినవాడులాగ పొలికేకలు వేస్తాడు. చూచే వారికది ఒక మీటింగులా ఉండదు. ఏదో పిచ్చిఆసుపత్రివలె తోస్తుంది. “దేశరాజ్యాంగంలో ఒకభాగమే అయినా ఎన్నికల ప్రచారం నిజంగా అస్వాభావికముగా, అనాగరికముగా, అసభ్యముగా ఉంటున్నది.” అని బెర్నార్డుషా రాశాడు. అందుచేత పెద్దపెద్ద నియోజకవర్గాల్లో సరియైన అభ్యర్థి ఎన్నుకోబడకపోవటంకూడా తటస్థిస్తుంది. “ఇది డెమాక్రసీ కాదు, మొబాక్రసీ” అన్నాడు గాంధీజీ వ్యంగ్యంగా. అర్హతగలిగి నీతిపరుడైన అభ్యర్థి ఇలాంటి అసభ్యప్రచారానికి నడుము బిగించలేడు. అంతరాత్మను చంపుకోగలవారు లంచాలచ్చి, ఇంకా అవినీతికరములైన మార్గాలవలంబించీ శాసనసభలను ఆక్రమించ జూస్తారు. అలాగ నీతిమాలిన ఖర్చులన్నీ భరింపగల ధనికవర్గమే చివరకు రాజ్యాంగాన్ని తన గుప్పిటిలో యిముడ్చుకోగలుగుతుంది. పరిపాలనచక్రం వారి హస్తగతమే ఔతుంది.

పెద్ద పెద్ద నియోజకవర్గాలలో ప్రస్తుతం అమలులోవున్న ఎన్నికల ప్రచారం మామూలు తంతు ఐపోయింది. అందులో విశేషమేమీ లేదు. వివిధ పార్టీల అభ్యర్థులలో వోటర్లకు సన్నిహితసంబంధం ఉండదు. ప్రభుత్వము మిక్కిలిగా కేంద్రీకృతము కావటంవల్ల స్థానిక ప్రజలకు ఎన్నికలలో ఉత్సాహం ఉండదు; పైగా ఎన్నికలపట్ల ఏవగింపు చేసుకుంటారు. ఎన్నికలు ప్రారంభమైనప్పుడల్లా ప్రజల్ని బలవంతాన రంగంలోనికి ఈడ్చుకురావలసివస్తున్నది. అమెరికావంటి నాగరిక దేశంకూడా ఓటు హక్కుగలవారిలో సగంమందిమాత్రమే ఓటు ఓటుచేస్తున్నారట.

## రాజకీయ పక్షాలు

సుస్థాపితములై, వ్యాప్తిచెందిన రాజకీయపక్షాల మూలాన వ్యక్తిగతమైన స్వతంత్ర ఆలోచనలకు తావులేకుండాపోతున్నది ఒకానొక అభ్యర్థి ఎంతో అర్హతకలిగినవాడై యుండవచ్చును. కాని అతడే రాజకీయపక్షానికి చెందనిపక్షంలో ఎన్నికలలో నెగ్గటం కష్టం. అట్లని ఈ రాజకీయ పక్షాలవల్ల ప్రయోజనం లేదని కాదనను. అవి ప్రజలకు అనేక జాతీయ సమస్యలను ప్రబోధించగలవు కాని అధునిక ప్రపంచంలో ఈపార్టీలన్నీ సంకుచితములై పోయినవి. "ప్రజాభిప్రాయాన్ని బహుధా విచ్ఛిన్నం చేయటానికే ఈ రాజకీయ పార్టీలు ఉపకరిస్తున్నాయి" - అన్నాడు ఏ. ఆర్. లార్డ్ "ఈ ఎన్నికల విధానము ప్రజా ప్రతినిధి ప్రభుత్వపు వ్యంగ్యచిత్రం. ఇది అమెరికా ఇంగ్లాండు దేశాలలో పెద్ద పెద్ద, నీతిమాలిన, మతిలేని రాజకీయ పార్టీలను లేవదీసింది" - అన్నాడు హెచ్ జి వెల్స్. శాసన సభలలోని చర్చలు కేవలం బూటకాలు. చర్చిత విషయం ఎంత ప్రముఖమైనదైనా తీర్పు ప్రభుత్వ పక్షానిదే. కాగా శాసన సభలు వట్టి 'బాతాఖానీ సంస్థ'లైపోయినవి; ప్రజలకు ఏవగింపు కలిగిస్తున్నవి.

## కేంద్రీకరణము

పరరాజ్యాలు వచ్చి ఎక్కడ దాడిచేస్తాయో అన్నభయంచేతనే ప్రతి దేశంలోనూ రాజకీయాధికారమంతా కేంద్రంలో కూడబెట్టటం జరుగుతున్నది కాగా పార్లమెంటరీ విధానంలో ప్రజాస్వామ్యము నేతిబీరకాయవంటిదైనది. పైకి బటారం, లోపల లొటారం శాసన సభల కార్యక్రమం ఎక్కిడి తొక్కిడిగా ఉంటున్నది. అందుచేత ఏ కార్యమూ శక్తివంతంగా సాగటానికి అవకాశంలేదు. కాలయాపన అనివార్య మౌతు

స్నది. "అందరికీ సంబంధించిన విషయాన్ని అందరూ కలిసి నిర్ణయించు కోవలె" - అన్న ప్రజాస్వామ్య విధానంలోని ప్రాథమిక సూత్రము మంట గలిసి పోతున్నది.

ఇవి ప్రస్తుత ప్రజాస్వామ్య విధానములోని కొన్నిలోపాలు. ఇంకా ఎన్నో ఉన్నాయి. అవన్నీ ఇక్కడ వివరించవలసిన పనిలేదు. ఇంతకూ చెప్పవచ్చిం దేమంటే - ప్రజాస్వామ్య మిప్పుడు సంధి దశలో ఉన్నది. బ్రతికి పడాలిమరి ! దాని ముందుగతి ఎటు ?

# 4

# గాంధీ విధానము

ప్రజాస్వామ్య విధానము ప్రస్తుతపు గండాలను గడిచి బైటబడేందుకు గాను కొందరు బుద్ధిశాలురు కొన్ని ప్రక్రియలను సూచించారు. దేశంలోని వివిధ వర్గాలవారి సంఖ్యలనుబట్టి దామాషా ప్రకారం ప్రతినిధులను ఎన్నుకునే పద్ధతిని సూచించాడు రాంసే ముయిర్. ఈ పద్ధతి ప్రకారం అల్ప సంఖ్యాకులకు ప్రభుత్వంలో మెజారిటీ రా నేరదు. కాబట్టి మొత్తంమీద ప్రజాభిప్రాయం మన్నింప బడుతుంది. అందువల్ల పార్టీ రాజకీయాలుకూడా దెబ్బతింటాయి. అర్హతగల అభ్యర్థులనే ఎన్నుకునే అవకాశాలేర్పడతాయి— అని ఆయన అభిప్రాయం. ప్రస్తుతం శాసన సభలలోని కార్యభారాన్ని సులువుచేసే నిమిత్తం రాంసే ముయిర్ ఒక 'కమిటీవిధానాన్ని' ప్రతిపాదించాడు. ఈయన సూచనలు ఆచరణయోగ్యములే గాని సమస్యను పూర్తిగా పరిష్కరింపజాలినవి కాదు. దామాషాపద్ధతిని అభ్యర్థులను ఎన్నుకునే పద్ధతిని (Proportional representation) మంచిదే. కాని అది చాలదు. కేంద్రప్రభుత్వభారనిర్వహణంలో ఉన్న కష్టాలన్నీ కేవలం 'కమిటీ విధానం' వల్ల తీరిపోవు.

"ప్రజలు బుద్ధిమంతులు, సానుభూతిపరులు, బాధ్యతానిర్వహణ రతులూ అయితే అంతా చక్కగానే సాగిపోతుంది"—అంటూ లార్డు బ్రైస్ ప్రజాస్వామ్య భవిష్యభ్యుదయానికి ప్రజల నైతిక శక్తులపై ఆశలల్లుతున్నాడు. ఆశీర్వచనాలతో పిల్లలు పుట్టరు. ప్రజాస్వామ్య విధానంలోని ప్రస్తుత అనర్థాలు తొలగవలెనంటే ఒక నిర్మాణాత్మకమైన కార్యక్రమాన్ని అనుసరించాలి: సమస్య బహుక్లిష్టమైనది మరి! "ఏవర్గానికీ ప్రత్యేక హక్కులంటూ ఉండని పోషలిస్టు సమాజంలో ధనిక-దరిద్ర విభేదాలకు తావుండదు. అప్పుడు ప్రజాస్వామ్యానికి స్థిరస్థాయి లభిస్తుంది"—అంటాడు ప్రొఫెసర్

లాస్కీ. కాని సామ్యవాదంతో మాత్రమే సమస్య పరిష్కారమైపోతుందా? మూస్తున్నాము కాదా, రష్యాలో ఈ సామ్యవాదం ఎలాగ మిలిటరీ నియంతృత్వానికి దారితీసిందో! "దేశంలోని సమస్త ఆర్థిక నిర్మాణబాధ్యతలను తానే వహించగలదిన్నీ ప్రజాస్వామ్య ప్రతిపాదితాలైన రాజకీయ-సాంస్కృతిక స్వాతంత్ర్యాలకు ప్రజలకు ప్రసాదించగలదిన్నీ...అయిన నూతన రాజ్యాంగాల్ని సృష్టించుకోవలసిన అవసరం ఉంది"—అని సర్ స్టాఫర్డు క్రిప్సు నొక్కి చెబుతున్నాడు. కాని అతడు సుస్పష్టమైన విధానమేమీ సూచించలేదు. జెకోస్లావేకియా అధ్యక్షుడు ఎడ్వర్డుబేనస్ విశిష్ట ప్రజాస్వామ్యనాయకునికి ఉండవలసిన లక్షణాలను కొన్ని వివరించాడు." అతడు సమగ్ర విజ్ఞాననిధి, బుద్ధిశాలి, శాస్త్రపరిశోధకుడు ఐవుండాలి. శీఘ్రనిర్ణయశక్తి, అత్యంత కార్యపరత్వము, శారీర-నైతిక బలాలు, అతనికి అవసరం." కాని మరి అలాంటి అసాధారణనాయక శిరోమణులు మనకు ఎక్కడ దొరుకుతారు?

సహజంగా చక్కని ఉపజ్ఞగల బెర్నార్డుషా ఒక సూచన చేస్తున్నాడు. Time and tide అనే పుస్తకంలో ఆయన యిలా రాశాడు. "నేను మానవజాతి మన స్తత్వాన్ని అవలోడిస్తూన్నవాణ్ణి. దేవతలతో సమానమైన మానవజాతి 'నభూతో నభవిష్యతి' 21 ఏండ్లు దాటిన ప్రతివ్యక్తికీ అనంతమైన, అవ్యాహతమైన రాజకీయ ప్రజ్ఞావివేకాలు ఉండటమనేది అసంభవం. కాగా వయోజనులందరికి వోటు వున్నంతమాత్రాన ప్రజాస్వామ్యం ఏర్పడదు. కాబట్టి ప్రజల విమర్శనలకు ఆగి, వారి పరీక్షలకు నిలిచిన ప్రజ్ఞానిధులనే శాసన సభలకు పంపాలి. అదే మన మనుసరించవలసిన సురక్షితమైన పంథా" అంటే అజ్మాతః పరిపాలన దక్షతగల అసాధారణ ప్రజ్ఞాశీలులను ప్రజాస్వామ్యవాదులు పరీక్షచేసి నిర్ణయించవలెనన్నమాట కాగా ఒక 'నియంతృత్వం ప్రజాస్వామ్యాన్ని' బెర్నార్డుషా ప్రతిపాదిస్తున్నాడు. కాని ఆపరీక్షలెట్టివి? అవి ఎవరు జరపాలి? అవసులుకూడా మేమే చేస్తామంటూ ఆ ప్రజ్ఞానిధులే ముందుకు వస్తారు — 'మేమే మీరక్షకులము, దేవతలము' అంటూ చివరకు 'షా' గారి "నియంతృత్వ ప్రజాస్వామం" విలుప్త ప్రజాస్వామ్యమై, కేవలనియంతృత్వంగా పరిణమించితీరుతుంది.

అహింస

అహింసావిధానమే ప్రజాస్వామ్యానికి రక్షా కవచం అని గాంధీజీ అభిప్రాయం. హింసావిధానంద్వారా ప్రజాస్వామ్యాన్ని పోషించుకుంటూ

న్నంతకాలమూ దుర్బలులకు క్షేమములేదు అబలులకూ, సబలులకూ సమాన సౌకర్యాలను చేకూర్చునదే నిజమైన ప్రజారాజ్యం. అది హింసాపద్ధతిని నెరవేరదు." ప్రస్తుత పాశ్చాత్య ప్రజాస్వామ్య ప్రభుత్వాలు కొంచెం ఇంచుమించు నాజీ—ఫాసిస్టు రాజ్యాలవంటివే "అని గాంధీజీ అంటున్నాడు. "నాజీ—ఫాసిస్టుల నిరంకుశత్వానికి ఒక మేలివలిపెము కప్పుతున్నారు. అంతే" "ప్రజాస్వామ్యానికీ, హింసావిధానానికీ నైధనతారం. ప్రస్తుతం పేరుకుమాత్రం ప్రజాస్వామ్యములుగా ఉన్న ప్రభుత్వాలు ముందు నియంతృత్వ రాజ్యాలుగా పరిణమించక తప్పదు. విశిష్ట ప్రజాస్వామ్యములుగా అభివృద్ధిచెందవలెనంటేమాత్రం నిస్సంకోచంగా అహింసాయుతములు కావలసిందే" లేదా, నిజమైన ప్రజాస్వామ్యం స్వప్నతుల్యమే. పరుల సంపత్తిని పిండి-పీల్చటమే కేపిటలిస్టు విధానం. అది హింసాత్మకము. దీనిని అరికట్టజాలినది అహింసాత్మకమైన రాజ్యాంగవిధానమే. ఆర్థికస్వాతంత్ర్య సామ్యాలను అనుభవించే సాంఘిక వ్యవస్థలేనిదే నిజమైన ప్రజాస్వామ్య రాజ్యాంగము నెలకొనజాలదు.

అయితే మరి ఈ ఆర్థిక స్వాతంత్ర్యసామ్యాలు లభించటం ఎలా? సోవియట్ సామ్యవాద మొకమార్గమా? ధనికవర్గాన్ని నిర్దాక్షిణ్యంగా హింసించి, నిర్మూలించి, "నిరంకుశ కూలీరాజ్యాన్ని" స్థాపించారు రష్యాలో. ఆ కూలీలకుకూడా అక్కడ వ్యక్తిగతమైన స్వాతంత్ర్యంలేదు. "పూర్వకాలపు నిరంకుశరాజుల పాలనలోకన్న ప్రస్తుత పాశ్చాత్య ప్రజాస్వామ్య ప్రభుత్వాలలోకన్న రష్యా సోషలిస్టు రాజ్యాంగంలోనే వ్యక్తిస్వాతంత్ర్యం పూర్తిగా దెబ్బతిన్నది" అని బోరిస్ బ్రట్జుకస్ రాశాడు. ఒకప్పుడు సోవియట్ రష్యాను ఎంతో ప్రశంసించిన మాక్స్ ఈస్టుమన్ కూడా చివరకు యధార్థాన్ని తెలుసుకొని ఇలా అన్నాడు: "ఎంతో బలీయముగా వ్యవస్థీకృతమైన ఒక అల్పసంఖ్యాక వర్గము ఎంతో ఉదారములుగా ధ్వనించే నినాదాలద్వారా ప్రజాసమూహాలను ఉద్రేకపరచి హింసామార్గాన రాజ్యాధికారాన్ని హస్తగతం చేసుకుని, పాలించేందుకు పూనుకుంటే అది నిరంకుశంగానే పర్యవసించితీరుతుంది." "సోషలిస్టు రాజ్యం" అనేది "మిలిటరీ నియంతృత్వాని"కి నాగరికనామం. అట్టి నియంతృత్వము వ్యక్తి అభ్యుదయానికీ, స్వేచ్ఛకూ తీరని అఘాతమే. జాన్ స్టూఅర్టుమిల్ చెప్పినట్టు "వ్యక్తిజీవన పరిస్థితులే ప్రభుత్వవిధానపు బాగోగులను వ్యక్తపరచే గీటురాళ్లు" అని మనం జ్ఞాపకముంచుకోవాలి "ప్రభుత్వం ప్రజల్ని

స్వకీయ వ్యక్తిత్వవికాసంలేని పెంపుడు జంతువులనుగామాత్రమే వినియోగించుకున్నందువల్ల ఆ ప్రజలు రానురాను అనామకులైపోయి, ఘనమైన కార్యభారమేదీ నిర్వహించలేని అశక్తులుగా తయారౌతారు." కాబట్టి ప్రజాస్వామ్యము తప్పని సరిగా అహింసా పద్ధతులపై వర్ధిల్ల వలసియున్నది.

## వి కేం ద్రీ క ర ణ ము

'అహింసాయుత ప్రజాస్వామ్యము' లోని మూలసూత్రము వికేంద్రీకరణము. హింసా విధానము రాజ్యాధికారాల్ని కేంద్రీకరిస్తుంది; అహింసా విధానము వికేంద్రీకరిస్తుంది. ఆర్థిక - రాజకీయాధికారము స్వయం సమృద్ధక స్వయంపరిపాలక - గ్రామ సంస్థలరూపేణా వికేంద్రీకృతం కావాలని గాంధిజీ అభిప్రాయం. కాని ప్రాచీన కాలంనాటి గ్రామ పంచాయతిలను అప్పటి రూపంలోనే యథాతథంగా పునఃస్థాపించాలని ఆయన ఉద్దేశం కాదు. ప్రస్తుత పరిస్థితులను, అవసరాలను బట్టి తగు మార్పులు చేసుకోవాలి. అదిగాక ఆనాటి ఆసంస్థలలో కొన్ని లోపాలులేకపోలేదు. అయినా అవి ఆదర్శ స్థానిక స్వపరిపాలన సంస్థలని ఒప్పుకో వలసిందే. కాబట్టి భావి భారత రాజ్యాంగము సుసంఘటితములైన అట్టి గ్రామ పంచాయతీలే పునాదులుగా ఏర్పడవలెనని గాంధిజీ నిస్సంకోచంగా చెబుతున్నాడు. "కేంద్రాధికారాలు ఎంత తగ్గితే ఆ ప్రభుత్వం అంతమంచిది."

రాజకీయాధికారాన్ని వికేంద్రీకరించాలన్న గాంధిజీ అభిప్రాయంతో చాలమంది పాశ్చాత్య రాజకీయజ్ఞులుకూడా ఏకీభవిస్తున్నారు. వివిధ రాజ్యాంగాల వారికి ఇతర విషయాల్లో అభిప్రాయ భేదాలు ఉన్నవిగాని, వికేంద్రీకరణకు మాత్రం అంతా అంగీకరిస్తూనే ఉన్నారు. ఆర్థిక రాజకీయ పరిపాలనాధికారం మిక్కిలిగా కేంద్రీకృతం కావటం ఎవరికీ ఇష్టం లేదు.

"దేశం చిన్న చిన్న యూనిట్లుగా విభాగితమై పరిపాలన బాధ్యతలు అందరి భుజస్కంధాలమీద పడాలి. పరిపాలనాధికారంగల చిన్న చిన్న సంస్థలలో వ్యక్తికి స్థానం చిక్కుతుంది. స్థానిక పరిపాలనలో, ఉత్పత్తి సమస్యలలో అతనికి ప్రాముఖ్యం ఉంటుంది రాజకీయంగా తనకూ కొంత విలువ ఉందనీ, స్వేచ్ఛ ఉన్నదనీ, సంఘానికేదో సేవ చేస్తున్నాననీ అతనికి సంతృప్తి చేకూరుతుంది. అప్పుడు ప్రభుత్వ యంత్రం ఇంత భారీగా ఉండ నక్కర్లేదు. స్థానికంగా అన్ని వ్యవహారాలూ స్థానిక వ్యక్తుల చేతిమీదుగా

పోగిపోతాయి. వారే సమాజము, సమాజమే వారు అన్నట్లు అవినా భావంగా, సమరసంగా పరిపాలన కార్యక్రమము నేరవేరుతుంది"_అంటాడు ప్రొఫెసరు జోడ్.

"అధికార కేంద్రీకరణము ప్రజాస్వామ్యానికి విరుద్ధము. ప్రజాభిప్రాయం ఎప్పటికప్పుడే, ఎక్కడికక్కడే వ్యక్తమౌతూ ఉండాలికదా! ఒకే ఒక కేంద్రంద్వారా సర్వ ప్రజాభిప్రాయమూ సుబద్ధంగా, అవ్యాహతంగా వ్యక్తం కాజాలదు"_అంటాడు ప్రొఫెసర్ కోల్. "సామాన్య ప్రజలను దేశసమస్యా జిజ్ఞాసువులను చేయవలెనంటే_ఏపనైనా అందరూ కలిసికట్టుగా, ఐక్యభావంతో, కూడి నిర్వహించగల ఉత్సాహాన్ని వారిలో పెంపొందించవలెనంటే_చిన్న చిన్న ప్రజాస్వామ్య కార్య నిర్వాహక సంస్థలు ఆధార శిలలు, సంఘ వ్యవస్థను నిర్మించుకోవాలి" ___ అంటాడు ప్రొఫెసర్ కోల్ తన 'Fation Socialism' అన్న గ్రంథంలో.

"బాధ్యతాయుత స్వపరిపాలనము, అధికార వికేంద్రీకరణము ఒక విశిష్టసాంఘిక వ్యవస్థను నిర్మించగలవు"___అన్నాడు ప్రొఫెసర్ ఆల్డస్ హక్స్లీ. ప్రజాస్వామ్య రాజ్యాంగాలు గలదేశాల్లోనైనా ప్రభుత్వ కేంద్రీకరణము వ్యక్తి స్వాతంత్ర్యానికీ, ప్రజలకోసము ప్రజాస్వామ్యముగాని, ప్రజాస్వామ్యము కొరకు ప్రజలు కాదు. ఆసంగతి మనం మరచిపోకూడదు. ఒకానొక ఆశయసిద్ధికోసమై ప్రజాస్వామ్య విధానమొక సాధనమాత్రమే, కనుక అది ప్రజల చిత్తవృత్తులకు సాంఘిక పరిస్థితులకు అనుగుణ్యమైనదిగా ఉండవలె "చిన్నచిన్న సంఘాల్లోనే మానవునికి సౌఖ్యం ఉంది"___అని సాంఘిక శాస్త్రంలో ఒక సూత్రం. తదనుగుణ్యంగా చిన్నచిన్న ప్రజాస్వామ్య సంస్థలను నిర్మించకపోతే సూత్న ప్రపంచ వ్యవస్థానిర్మాణ ప్రయత్నాలు నిష్ఫలములు గాక తప్పదు__అని లాయిగ్లెండే అంటున్నాడు. అట్టి చిన్నచిన్న సంఘాలతోటి సంబంధములేని వ్యక్తి గుల్లలేని నత్తపురుగువలె ఆధారరహితుడు___అని కారల్ మాన్‌హీమ్ అభిప్రాయం. అట్టి సంస్థల వలన ప్రజల్లో పరస్పర సమరసభావం పెంపొందుతుంది___అని ప్రొఫెసర్ గిన్స్బర్గ్ అంటాడు. నిజమైన ప్రజాస్వామ్యం వర్ధిల్లటానికి ఆసమరసభావం ఎంతో అవశ్యకమైనది. ఆధునిక కేంద్రీకృత ప్రజాస్వామ్య రాజ్యాంగాల్లో అదే లోపిస్తున్నది. అందుచేతనే ప్రొఫెసర్ అడమ్స్ ప్రస్తుత ప్రజాస్వామ్య రాజ్యాంగాలలోని వివిధలోపాలను వివరించి వికేంద్రకరణపద్ధతిని సూచించాడు." మిక్కిలిగా కేంద్రీకృతమైన రాజ్యాంగంతో ప్రభుత్వంపట్ల భక్తి

శ్రద్ధలు అరుదుగా ఉంటాయి. కాబట్టి వికేంద్రీకరణ విధానమును అవలంబించ వలె" — అంటాడు ప్రొఫెసర్ లాస్కీ కూడా. "కేంద్రీకృత రాజ్యాంగం కేవలమొక యంత్రంలా సాగిపోతూ ఉంటుంది. అందులో జీవంలేదు. ప్రజావిశేషాల నవనవోన్మేషం లేదు".

గొప్పసాంఘిక విజ్ఞానవేత్త లూయీమమ్‌ఫర్డు చిన్నచిన్న ప్రజాస్వామ్యసంస్థలు సర్వాంగసహితమైన స్థానిక స్వపరిపాలన బాధ్యతలను వహించి క్రమేణా చక్కని రాజకీయ తర్ఫీదును అలవరచుకోగలవు. అలాగైతే నిరంకుశత్వానికి తావుండదు. స్థానిక సమస్యలను నిష్పాక్షికంగా చర్చించటానికి వీలౌతుంది. "అసలు ప్రజాస్వామ్యం మొట్టమొదట చిన్నచిన్న సంస్థలుగానే ఆరంభమైంది. వాటినించే మనం అనేక సూత్రాలను, విధానాలను గ్రహించాము. ప్రభుత్వవిధానంలో ప్రజల యిచ్ఛ ఎలా ప్రతిఫలించవలెనో వాటిల్లో ద్యోతకమౌతుంది" — అన్నాడు లార్డుబ్రైస్. స్థానిక స్వపరిపాలన మని లాభాలు వివరిస్తూ జేనీ ప్రసాద్ ఇలా రాస్తున్నాడు:

"అరిస్టాటిల్ చెప్పినట్లు ఒక స్వయంపరిపాలక యూనిట్‌లో ప్రజలను ఒకరినొకరు బాగా తెలిసివుంటారు. పల్లెలలోనూ. పట్నాల్లోనూ సర్వతంత్ర స్వపరిపాలన సంస్థలవలన ప్రజాస్వామ్య సౌకర్యములు చేకూరగలవు. తద్వారా ప్రజల్లో దేశభక్తి నెలకొంటున్నది. వ్యక్తిఅభ్యుదయానికి తావుఉంది. పరస్పర సహకారం పెంపొందుతుంది ఎక్కడో దూరాన ముఖ్యపట్నాల్లో ఏర్పడే శాసనసభలకు వెళ్లలేని లక్షలాది సామాన్య ప్రజలకుకూడా రాజకీయ విజ్ఞానము, పరిపాలన దక్షత క్రమేణా అలవడగలవు. పట్నాల్లోనూ, జిల్లాల్లోనూ స్థానిక స్వపరిపాలనము స్థిరపడితే కేంద్రశాసన కార్యనిర్వాహక సభల భారం చాలవరకు తగ్గిపోతుంది. పెద్ద పెద్ద నియోజకవర్గాలతో అవసరం ఉండదు. పెద్దపెద్ద నియోజకవర్గాలలో ఆతదంగానికి వోటరు దిగ్భ్రాంతి చెందుతాడు. తనకేమీ హక్కు లేదనిపిస్తుంది. 'సరే ఎలాగైతేఅలా అవుతుంది' అని నిస్పృహ చెందుతాడు. స్థానిక సర్వతంత్ర స్వపరిపాలనా విధానంవల్ల ప్రజల్లో అట్టి నిస్పృహను తొలగించవచ్చును."

## గ్రీసుదేశపు "సిటీ" రాజ్యాంగాలు

ప్రాచీన గ్రీసుదేశపు పట్నాలు స్థానిక సర్వతంత్ర స్వతంత్రం అనుభవించాయి. సర్వరాజకీయాధికారాలు పౌరుల చేతుల్లోనే ఉండేవి 'పౌరులే

పార్లమెంటు, ప్రభుత్వం, శాసనసభ, కార్యనిర్వాహకసభ, న్యాయపరిపాలన
శాఖ అన్నీని. అలాగ ప్రజల్లో పరస్పర సన్నిహిత బాంధవ్యం దినదిన
ప్రవర్ధమానమౌతూవచ్చేది. అందుచేత ప్రత్యేక రాజకీయపార్టీల ఆవశ్యకత
లేకపోయింది. సుడిగాల్పులవంటి ఎన్నికల ప్రచారాలు లేనేలేవు. నిర్వా
చకవర్గాలు చాల చిన్నవి. వోటుహక్కు గలవారంతా ఒకేచోట సమావేశ
మయ్యేవారు. ప్రతివ్యక్తికీ అభ్యర్థుల అర్హతలు ఎలాంటివో తెలిసేవి. ఈరా
జ్యాంగయూనిట్లు ఎంతో చిన్నవి. సాధారణంగా రాజ్యాంగయూనిట్లు
ఎంతచిన్నవైతే పరిపాలన అంత శ్రేయస్కరంగా ఉంటుందని ప్లాటో
అభిప్రాయం. అటువంటప్పుడే ఏ ఒక్కరికి బాధకలిగినా మిగిలినవారిలో
సానుభూతి రేకెత్తటానికి అవకాశాలుంటాయి. కాగా గ్రీసుదేశపుపట్నాల్లో
ప్రజలు ఏకమత్యంతో జీవించేవారు. వారి సిటీ రాజ్యాంగం ఒక "విశిష్ట
జీవన విధానం" అని అరిస్టాటిల్ నిర్వచించాడు.

ఈ గ్రీసు - సిటీ రాజ్యాంగా నిర్దుష్టమైనవని నేననను. కొన్ని
లోపాలు వాటిల్లోనూ ఉన్నవి. వారి బానిస వర్తకం ఎన్నిటికి సమర్థనీయం
కాదు. కాని ఆ దేశస్థులంతా ముఖ్యంగా ఎథీనియనులు కలిసిమెలసి సుహృ
ద్భావంతో సమిష్టిగా శాంతిజీవితాలను గడుపుకోగలిగారు. కాబట్టి ఆదే
శము ఐరోపీయ విజ్ఞానానికి ఆధారపీఠమైంది. "ఏథెన్సు చరిత్రలో అంతా
కళోపాసకులే, కవులే, వేదాంతులే. శిల్పకళలో నాటకరచనలో వేదాం
తంలో వారు అతి స్వల్పకాలంలోనే ఎన్నో అద్వితీయములైన క్రొత్తపోకడ
లను అన్వేషింపగలిగారు"

### భారత గ్రామ పంచాయితీలు.

పారిశ్రామిక విప్లవం రాకముందు అనేక ఐరోపీయ దేశాల్లోకూడా
స్థానిక సర్వతంత్ర స్వపరిపాలనము అమలులో ఉండేదే. ఆనాటి ఆప్రజలు
సన్నిహిత సమిష్టిజీవితాన్ని గురించి ప్రిన్స్ క్రొపెట్కిన్ తన 'Mutual Aid'
అన్న గ్రంథంలో వివరించాడు. చైనా — జపాన్ దేశాలలోకూడా అతి
ప్రాచీనకాలంలో వికేంద్రీకృత గ్రామసంఘాల ద్వారానే రాజ్యపాలనసా
గింది. ఇట్టి స్థానికసర్వతంత్ర స్వపరిపాలనావిధానము "ఓంప్రథమంగానెలకొని
చిరకాలము పరిపోషితమైనది. భారతదేశంలోనే" ఇది భారతీయులు గర్వించ
తగిన విషయం. గ్రామ పంచాయతీలు మనకు అనాదినించే వస్తూన్న సాంప్ర
దాయం. గంగాయమునల మధ్య ప్రదేశాన్ని ఆక్రమించినప్పుడు పృథుచక్ర

పత్రి ఈ రాజ్యాంగ విధానాన్ని అక్కడ ప్రవేశపెట్టినట్టు చెబుతారు. మనుస్మృతిలోను, మహాభారతశాంతి పర్వంలోనూ, ఈ గ్రామసంఘాల ప్రశంసఉంది. క్రీ. పూ. 400 సం॥లో నివసించిన కౌటిల్యుని 'అర్థశాస్త్రం'లో ఈ గ్రామసంస్థల గురించిన వర్ణన ఉంది. వాల్మీకి రామాయణంలోని 'జానపద'శబ్దం అనేక స్వయంపరిపాలిత గ్రామాల సమాఖ్యాసూచకము కావచ్చును. అట్టి రాజ్యాంగ విధానం మనదేశంలో గ్రీకుల దండయాత్ర కాలమున ఉండినదన్నమాట యథార్థం. మెగస్థనీసు 'పంచాయితీ' అన్న మాటను 'పెంటాడ్' అని రాశాడు. చైనా యాత్రికుడు హ్యూయాన్ త్సాంగ్, ఫాహియాన్‌లుకూడా ఈమాదేశాన్ని చూడవచ్చినప్పుడు ఇక్కడిప్రజలు సిరిసంపదలతో, సుఖశాంతులతో ఎలా కళకళలాడుతూ ఉండేవారో విడమరచి రాశారు. ఏడవశతాబ్దంలోని మన దేశపు 'గ్రామ స్వరాజ్యాన్ని' గూర్చిన వివరాలు శుక్రాచార్యుని 'నీతిశాస్త్రం'లో కనిపిస్తున్నవి.

వేదయుగంలోనే గ్రామాన్ని ఒక రాజ్యాంగ యూనిట్‌గా పరిగణించినట్టు ఆధారాలున్నవి ఋగ్వేదంలో (X 62 II; 107.5) 'గ్రామిణి' అన్న శబ్దం ఉంది. అంటే గ్రామానికి పెద్ద అన్నమాట, జాతక కథలలో కూడా 'గ్రామసభల' ప్రశంస ఉన్నది. 'వర్తకసంఘా'నికి పర్యాయపదంగా 'శ్రేణి' అన్న శబ్దం వాడుకలో వున్నదే. వేదయుగము అనంతరంకూడా చాలకాలంవరకూ గ్రామము రాజ్యాంగ-యూనిట్‌గానే ఉంటూవచ్చింది. విష్ణు - మనుస్మృతులలో గ్రామము రాజాంగ - యూనిట్‌గా పేర్కొనబడింది." ధర్మసూత్రాలలో, ధర్మశాస్త్రాలలో 'గణ', 'పుగ' అన్నశబ్దాలు వినిపిస్తాయి. 'గ్రామపరిపాలక సంఘానికీ, 'పురపారిపాలక సంఘాని'కి అవి పర్యాయపదాలు కావచ్చును. అనేక శాసనాలనుబట్టికూడా మన దేశంలో స్థానిక స్వపరిపాలన సంస్థలు విరివిగా ఉండినట్టు రుజువు చేయవచ్చును.

హిందూ మహమ్మదీయ యుగములలో, పీష్వాల పరిపాలనలో, తూర్పు ఇండియాకంపెనీ ప్రభుత్వం స్థాపితమైనంతవరకూ మన గ్రామ పంచాయితీలు వర్ధిల్లినవి. అనేక రాజవంశాలు నశించినా, సామ్రాజ్యాలు తలక్రిందులైనా "గ్రామస్వరాజ్యం" మాత్రం చెక్కుచెదరకండా నిల్చింది. దేశమంతటా స్థానిక స్వపరిపాలన సంస్థలు వృద్ధిచెందిన కారణాన తాచేలుకు కర్పరమువలె రాజకీయ తుపానులు రేగినప్పుడు ఆ యలజడిలో వలిగిపోకండా జాతీయ సంస్కృతికి రక్షణకవచము లభించినట్లయింది." గ్రామ పరిపాలన విషయాల్లో ఏవిధమైన జోక్యమూ కలిగించుకునేవారు కాదు.

"అనేకమంది పరరాజులు ఒకరితరువాత ఒకరు ఇండియాపై దండయాత్రలు చేశారు! కాని గ్రామపరిపాలన సంస్థలుమాత్రం దర్భగడ్డివలె వేళ్లుపాతుకుని దేశంలో అలాగేనిల్చివున్నాయి — అన్నాడు సర్ ఛార్లెస్ ట్రెవిలిన్. "ప్రపంచంలోకెల్లా మిక్కిలిగా రాజకీయ మతవిప్లవాలకు గురియైనది భారతదేశమే; అయినా అక్కడి గ్రామ పంచాయితీ రాజ్యవిధానంమాత్రం నిండు తేజంతో వెలిగింది. హిమాలయ పర్వతాలమీదుగా సిథియనులు, గ్రీకులు, ఆఫ్ఘనులు, మంగోలులు ఇండియాపై దండెత్తివచ్చారు. సముద్రము మీదుగా పోర్చుగీసువారు, డచ్చివారు, ఆంగ్లేయులు, ఫ్రెంచిదేశస్థులు ఇక్కడ ప్రవేశించి ఆక్రమణ సాగించారు, అలల తాకిడికి పర్వతం ఎంత చలిస్తుందో వీరందరి దాడులకు భారతగ్రామాలు అంతగానే వొణికాయి" — అన్నాడు సర్ జార్జిబర్డ్వుడ్. 1830 లో ఆక్టింగ్ గవర్నరుజనరల్ గా వున్న సర్ ఛార్లెస్ మెట్ కాఫ్ ఇలారాస్తున్నాడు.

"గ్రామాలన్నీ స్వయంపరిపాలక యూనిట్లు; అన్ని విషయాల్లోనూ స్వయంపోషకములు. ఇతర్లపై ఆధారపడవలసిన అవసరమే లేదు. అన్నీ మంటగలసిపోతున్నా అవిమాత్రం చెక్కుచెదరటంలేదు. రాజవంశాలెన్నో వరుసగా నశించాయి. విప్లవం తరువాత విప్లవం తాండవించింది. భారతగ్రామాలు మాత్రం అలాగే హాయిగా ఉన్నాయి దేశంలో ఎన్నిమార్పులు వచ్చినా, భారత ప్రజలు సంతుష్టితంగా, సుఖంగా ఉన్నారంటే అందుకు కారణం సర్వతంత్ర స్వపరిపాలనాధికారులూ గల గ్రామపంచాయితీల రాజ్యవిధానమే. అదే వారి నిరంతర సౌఖ్య జీవితానికీ, అనుపమస్వేచ్ఛకూ హేతుభూతము. అట్టి గ్రామ సంస్థలను ఛేదించటం కూడని పని".

కాని విధిలిఖితం వేరుగా ఉంది మరి! ఈస్టుఇండియా కంపెనీవారి దురాశలకు, దుశ్చింతలకు మన గ్రామ పంచాయితీలు బలియైనవి. కారన్ వాలిస్ ప్రభువు ప్రవేశపెట్టిన రైతువారీ పద్ధతి గ్రామపంచాయితీల ఆయువుపట్టులో తీవ్రతర-అఘాతంగా పరిణమించింది. క్రమేణా బ్రిటిష్ ఇండియాలో కార్యనిర్వాహక-న్యాయ పరిపాలన (Executive and Judicial) శాఖలను కేంద్రీకృతం చేయటంతో గ్రామస్వరాజ్యం పూర్తిగా నశించిపోయింది.

"భారతీయుల గ్రామస్వరాజ్యంలో జీవం ఉంది" — అన్నాడు సర్ హెన్రీమైన్ తన "Village Communities in the East and

West" అన్న గ్రంథంలో. బేడెన్ పవెల్ కూడా తన "The Indian village community" అన్న పుస్తకంలో మన గ్రామసంస్థలను గురించి వివరంగా రాశాడు. మనదేశంలో గ్రామపంచాయితీలు ఎలా వ్యవహరించారో ప్రొఫెసర్ ఆల్‌టేకర్ తన "History of Village Communities in Western India" అన్న గ్రంథంలో చక్కగా వివరించాడు. కాని వాటిని గురించిన సర్వవిషయాలను సమగ్రంగా రాధాకుముదముఖర్జీగారి 'Local Government in Ancient India' అన్న గ్రంథంలోనూ డాక్టరు రాధాకమలముఖర్జీగారి "Democracies of the East" అన్న గ్రంథంలోనూ చదువుకోవచ్చును. అవన్నీ ఇక్కడ చర్చించటము అనవసరం. మన 'గ్రామస్వరాజ్య' వినాశనము బ్రిటిష్‌పరిపాలనా దుష్ఫలితములలో ప్రధానమైనదని మనం జ్ఞాపక ముంచుకోవాలి.

బ్రిటిష్‌వారు మనదేశంలో నెలకొల్పిన స్థానిక స్వపరిపాలనా విధానము విదేశీయము, భారత సాంప్రదాయను బద్ధముకాదు. అందుచేతనే అది విఫలమైంది "యిప్పుడుకూడా గ్రామాధికార్లకు పూర్వకాలంనాడు వ్యవహృతములైనపేర్లే పెట్టారు. కాని ఆకాలంలో పంచాయతీపెద్దలను ప్రజలుఎన్నుకున్నారు. ప్రజలకు వారు బాధ్యులైయుండేవారు. కాని ఇప్పుడు వారు గవర్నమెంటు ఆఫీసర్లకు బాధ్యులైవుంటున్నారు. ప్రస్తుతం ప్రజలను సంతోషపెట్టడంకన్న ప్రభుత్వాన్ని తృప్తిపరచటమే వారి ఆశయమైపోయింది" అన్నది అనీబెసెంటు.

ఏవో కొన్నిలోపాలుఉన్నా మన అనాటి గ్రామస్వరాజ్యం ఉత్తమమైన స్థానిక స్వపరిపాలనమును, విశిష్టమైన ప్రజాస్వామ్యమును చవిచూచింది. ప్రస్తుత మట్టి స్థానిక స్వపరిపాలనములేక, ప్రభుత్వాధికారమంతా కేంద్రానికి వొప్పజెప్పడంచేత రాజకీయాలు నిర్జీవములైనవి; వ్యక్తికీ సంఘానికీ మధ్యన తీవ్రసంఘర్షణలు బైలుదేరినవి. మన పూర్వపు గ్రామపంచాయితీలు అట్టి విభేదాలకు తావుయివ్వక ప్రజల సాంఘిక రాజకీయ జీవన క్షేత్రాలను సౌఖ్యవిజ్ఞాన సంపద్వంతములను చేసినవి. ఆచార్య వినోబా భావే చెప్పినట్లు "ఈ గ్రామసభలలోని ప్రతివ్యక్తీ తనకు తానేక రాజు ఇతరి గ్రామస్థులతోటి సన్నిహితసంబంధ బాంధవ్యాలు కలిగివుంటాడు." అట్టి రాజ్యాంగంలో సంపూర్ణ వ్యక్తిఅభ్యుదయానికి అవకాశాలున్నాయి; ప్రతివ్యక్తీ సంఘాభ్యుదయానికి తోడుపడవలసివుంది. వికేంద్రీకరణ విధా

నంలో భారతీయులకూ పాశ్చాత్యులకూ తేడావుంది. భారతీయుల వికేంద్రీకరణము పరిపాలన విధులయందే గా ప్రాదేశికం గాకూడా అమలుజరిగింది. అందుచేతనే వారి రాజకీయ జీవితము ప్రతిభావంతము, సాంఘిక జీవితమూ సౌఖ్యమయము వినవి.

ప్రస్తుత ప్రజాస్వామిక రాజ్యాలలో కనిపిస్తూన్న లోపాలేమీ భారతీయుల గ్రామస్వరాజ్యంలో లేనేలేవు. లంచగొండితనం మచ్చుకైనా లేదు. పెట్టుబడిదారీవిధానం అసలేలేదు. నిజమైన ప్రజాస్వామ్యమే అంతటా ఆనందమయనృత్యం చేసింది. చిన్నచిన్న నియోజకవర్గాలు కావటంచేత ఎన్నికలు ఏకగ్రీవంగా జరిగేవి. ప్రజలందరికీ గౌరవపాత్రులుగా ఉంటూన్న గ్రామపెద్దలు ఒక్క దమ్మిడీ ఖర్చు లేకుండా ఎన్నుకోబడేవారు. పరిపాలనాధికారం వికేంద్రీకరించటంచేతనూ, ఎక్కడికక్కడే స్థానిక స్వపరిపాలనలు సాగుతూవున్నందువల్లనూ గ్రామసభలలో కార్యక్రమం భారీగా ఉండేది కాదు. ఇలాగ భారతీయుల ప్రజాస్వామ్యం సత్ఫలితాలతో, అహింసా పద్ధతిని, జీవంతో కళకళలాడింది. ఆధునిక ప్రజాస్వామ్యమో! అదినిర్జీవము, ఫలరహితము, హింసాదూషితము. కనుక అలనాటి పంచాయతీ సభలనే పునరుద్ధరించాలి; భావిభారత రాజ్యాంగ నిర్మాణానికి వాటినే పునాదులుగా స్వీకరించాలి. రాధాకమల ముఖర్జీ చెప్పినట్టు "పాశ్చాత్య రాజ్యాంగ విధానాలను అనుసరించటం దేనికి? మన పూర్వకాలంనాటి గ్రామస్వరాజ్యమే మనజాతికి అనుగుణ్యమైనది, ఉజ్జీవకరమైనది. హింసావిధానముతోనూ, సామ్రాజ్యతత్వముతోనూ పరిప్లుతమైవున్న నేటి ప్రపంచ రాజకీయ చరిత్రకు ఈ "గ్రామస్వరాజ్యము" ప్రాచ్యఖండము ప్రసాదించిన మణిదీపము కాగలదు." ముఖర్జీ యింకా ఏమంటున్నాడంటే—

"ప్రపంచ రాజకీయ చరిత్రలో 'గ్రామస్వరాజ్యం' ఒకనూతన అధ్యాయం. వివిధస్థానిక స్వపరిపాలన సంస్థలుకూడ దేశ భవిష్యదభ్యుదయ కార్యక్రమాన్ని...రోమన్-ట్యూటనిక్ రాజ్యాంగాలకన్న మిన్నగా...నిర్వహింపగలవు. ఆధ్యాత్మిక నైతిక విశిష్టతగల ఈప్రాచ్య రాజ్యాంగ విధానము ఆధునిక యుగంలో అనేక సాంఘిక రాజకీయ-క్లిష్ట సమస్యలను సులభంగా పరిష్కరించివేస్తుంది. పరరాజ్య ఆర్థిక శోషణమే ఆశయంగాగల, జీవంలేని ఒకే రకపు రాజ్యాంగ యంత్రములో నేటి ప్రపంచం చిక్కుకునిఉంది. ప్రాచ్యవిజ్ఞానము పునరుద్ధరితమై, ప్రజలంతా చిన్నచిన్న స్వతంత్ర సమాజ

ములుగాకూడి, స్వేచ్ఛగా, సంతృప్తితో, అభ్యుదయ మార్గాన సుఖ జీవితాలను గడుపుకోవలెనంటే ఒక నవ్య సాంఘిక వ్యవస్థ నిర్మించుకోవలసిందే. అందుకు "గ్రామస్వరాజ్య"మే శరణ్యము.

## పరిశ్రమల వికేంద్రీకరణం

వికేంద్రీకృతమైన గ్రామస్వపరిపాలన రాజ్యాంగంలో దేశమంతటా ఆర్థికసంపద సక్రమంగా విభాజితము కాగల అవకాశం వుంది. ప్రస్తుత పాశ్చాత్య రాజ్యాంగ విధానాలలో ఉత్పత్తి శక్తులన్నీ ధనికవర్గం గుప్పెట్లో వున్నవి. ప్రపంచంలో శాంతిలేదు. నిజమైన అభ్యుదయం కానరాదు. సామ్యవాదమేమో ధనికవర్గాన్ని నిర్దాక్షిణ్యంగా నిర్మూలించివేసింది. సోవియట్ కమ్యూనిజమ్ ఉత్పత్తి సాధనాలన్నింటినీ తన ఆధీనంలోకి తీసుకుని సాధారణ ప్రజలజీవన ప్రమాణాన్ని హెచ్చించినమాట వాస్తవమే. కాని అది వ్యక్తి జీవితాన్ని స్వేచ్ఛారహితము చేసింది. ఆ రాజ్యాంగంలో వ్యక్తికి వూరూ పేరూ ఉండదు. కాగా సామ్యవాదాన్ని మనం ఒక "వర ప్రసాదం"లా భావించేందుకు వీల్లేదు, అదీగాక రానురాను రష్యా తన యిరుగు పొరుగు రాజ్యాలపై తన రెక్కలు కప్పుతోంది. రష్యా అంతర్జాతీయ వ్యవహారాలు స్వార్థరహితము లనటానికి వీల్లేదు. కేపిటలిస్టులదైనా, సోషలిస్టులదైనా...సామ్రాజ్యవిధానము గర్హ్యమే. అధికంగా కేంద్రీకృతమైనప్పుడు సోషలిస్టు ప్రభుత్వమైనా హింసాదూషితమూ, సామ్రాజ్యతత్వ ప్రాధాన్యమూ ఐతీరుతుంది. కాబట్టి అల్ప-అగ్ర సర్వరాజ్యాలవారికి స్వేచ్ఛ క్షేమం లభించగల నూతన ప్రపంచవ్యవస్థను సామ్యవాదం ఒక్కనాటికీ సృష్టించలేదు.

మరి గత్యంతరం ఏమిటి? కుటీర పరిశ్రమల వికేంద్రీకరణమే. భారతీయుల పంచాయతీ రాజ్యాంగం కేపిటలిజమ్నూ, సోషలిజమ్నూ సమన్వయం చేసి ఒక మధ్యమార్గాన్ని అవలంబించింది. వ్యవసాయంలోనూ, పరిశ్రమలందూ వారొక "సమిష్టికృషి"ని పాటించారు. అందుచేత ధనికులు బీదలను పీడించటమనేది ఆనాడు లేనేలేదు. గాంధీజీ అన్నట్టు పదార్థము ఉత్పత్తియైన ఉత్తరక్షణమందే పంపిణీ అయిపోయేది. కుటీరాల్లో, గృహయంత్రాగారాల్లో వస్తువులు సద్యోపయోగార్థమే తయారయ్యేవి; ఎగుమతికోసం కాదు. ఏప్రాంతాని కాప్రాంతం స్వయం పోషకంగా ఉండగలందుకే వస్తూత్పత్తి పరిశ్రమలు సాగినవి. కాబట్టి పెట్టుబడిదారీ విధానానికి తావే లేక

పోయింది. అలాగ వ్యక్తిస్వాతంత్ర్యానికి ఆటంకం లేకుండా...ఏకొద్దిమందికో మాత్రమో సర్వరాజకీయాధికారాలు కట్టిపెట్టకుండా... దేశంలో ఆర్థికసామ్యాన్ని సాధింపగలిగారు. కనుక కుటీర పరిశ్రమలను వికేంద్రీకరించి పెట్టుబడిదారీ విధానంపైగాక, సమిష్టి సహకార పద్ధతులపై, సాగించవలెనని గాంధీజీ అభిప్రాయం. జపాన్‌లోవలె కుటీర పరిశ్రమలుకూడా పెట్టుబడిదార్ల అధీనంలోనే ఉండేట్లయితే వాళ్లు పనివాళ్లను పీడిస్తూనే ఉంటారు

ఆనాటి మన గ్రామసభలలోకూడా కొన్నిలోపాలు లేకపోలేదు. ఉదాహరణంగా : వర్ణవ్యవస్థ సంఘంలో అర్థంలేని విభేదాలను తెచ్చిపెట్టింది. అప్పుడుకూడా కొలదిమంది కోటీశ్వరులు ఉండేవారే ఈ గ్రామసభలు రాజకీయ ఆర్థిక కార్యక్రమాలను ఫలోన్ముఖంగా సమన్వయం చెయ్యలేకపోయినవి. ప్రజల జీవన ప్రమాణంకూడా తక్కువే. అయినా ఈ 'గ్రామస్వరాజ్యము' ఉత్తమ భారతీయ వైజ్ఞానికుల సృష్టి సక్రమంగా సాగించగలిగితే విశాలాశయాలపై ఆర్థిక నిర్మాణం జరుగుతుందని విశ్వసించవచ్చును. యుద్ధాలతో విశీర్ణమైన ఈ ప్రపంచంలో, అనేక క్లిష్టసమస్యలతో రాత్రింబవళ్లు వేగిపోతున్న మనకు ఇదే పరమౌషధం.

కుటీర పరిశ్రమలను వికేంద్రీకరించటంవల్ల పెద్దపెద్ద యంత్రాలతో మనకు పనిఉండదు. వాటివలన వచ్చే అనర్థాలు తప్పిపోతాయి. "పెద్దపెద్ద యంత్రాలువచ్చాక పనివాళ్ల చాకచక్యం, ఉత్సాహం నశించినవి. పనివాడు యంత్రంలో ఒకమర ఐపోయాడు" అన్నాడు కారల్ మార్క్స్. యంత్రాగారాల్లో అధికోత్పత్తి ఔతున్నది; మామూలు పనివాని చేతులు చచ్చుపడిపోయినవి; ఫ్యాక్టరీలో తానూ ఒక యంత్రంలాగే పనిచేస్తూ మానవత్వం కోలుపోయాడు. "స్వతంత్రంగా తమపని చేసుకుంటూన్న రైతులు, చేతిపనివాళ్లు, విజ్ఞానం, అంతర దృష్టి, స్వతంత్రభావాలు అలవరచుకుంటున్నారు" భావరసోద్వేగము, ఆత్మాభివ్యక్తి సాక్షాత్కారము వారి కృషిలో ప్రతిఫలింపచేసుకోగలుగుతున్నారు" యంత్రపరిశ్రమల వలని అనర్థాలను కారల్ మార్క్స్ గుర్తించాడు కాని అవి సోషలిస్టు రాజ్యాంగంలో అంతరించిపోగలవని అతడు ఆశించాడు. సోషలిస్టు వ్యవస్థలోనైనా, కేపిటలిస్టు సమాజంలోనైనా యంత్రపరిశ్రమలు కార్మికజనుల భౌతిక ఆధ్యాత్మిక నైతిక అభివృద్ధికి ఆటంకములే "ఉత్పత్తి పంపక సమస్యలను స్వార్థపరులైన పెట్టుబడిదారుల అధీనంనించి తప్పించినంతమాత్రాన లాభంలేదు. ఫ్యాక్టరీలు

ఉన్నంతవరకూ మానవజాతికి స్వాస్థ్యంలేదు." కనుకనే గాంధీజీ యంత్రశ్రమలపట్ల విముఖుడు. కాని యంత్రములు నన్నింటినీ విసర్జించవలసినదేనని ఆయనఅభిప్రాయం కాదు. అనవసరంగా, అర్థంలేకుండా, కేవలం వెర్రిగాయంత్రాలను దిగుమతి చేసుకోరాదని ఆయన అంతర్యం. "శ్రామికులు తక్కువగా ఉండి, అధికోత్పత్తి కావలసివస్తే యంత్రసహాయం పొందవచ్చును. ఇండియాలోవలె జరగవలసిన పనితక్కువై, చేసేవాళ్లు అధికంగా ఉన్నప్పుడు యంత్రాలను ఉపయోగించటం అనర్థదాయకమే" అంటాడు గాంధీజీ.

యంత్రయుగం పనివాళ్లకు అపకారమే చేసింది. "బంయ్"మని మోత పెడుతూఉండే పెద్దపెద్ద ఫాక్టరీలలో ఉదయంనుంచి సాయంత్రంవరకూ పనిచేస్తూఉండే కార్మికులు స్వీయవ్యక్తిత్వాన్ని మంటగలుపుకున్నారు. కాని లక్షలాది రైతులకు, చేతిపనివాళ్లకు కొంచెం శ్రమ తగ్గించగల చిన్న చిన్న యంత్రాలను ఉపయోగించవచ్చునని గాంధీజీ అభిప్రాయం.

కుటీరపరిశ్రమల స్థాపనవల్ల నిరుద్యోగసమస్యకూడా చాలవరకు పరిష్కృతమౌతుంది. పాశ్చాత్యదేశాల ఆర్థికనిర్మాణ కార్యక్రమంలో "ప్రజలందరికీ చేతినిండా పని కల్పించటం" మనేది ముఖ్యాంశం. కాని యంత్రపరిశ్రమల ద్వారా అందరికీ ఉద్యోగం కల్పించటం సాధ్యమౌతుందా? బ్రిటన్-అమెరికాలవంటి అత్యధిక పారిశ్రామిక దేశాల్లో కూడా లక్షలాది ప్రజలు నిరుద్యోగులై ఉండవలసివస్తున్నది. భారతదేశంలో 40 కోట్లమంది ఉన్నారు. మిల్లులు, ఫాక్టరీలు నిర్మించినంత మాత్రాన వీరందరికీ నౌకరీలు దొరుకుతాయని ఖాయంగా చెప్పగలమా? ప్రస్తుతం మనదేశంలో ఘన పరిశ్రమలన్నింటిలోనూ 2 మిలియన్లమంది పనిచేస్తున్నారు. బొంబాయి ప్లానుకర్తలు సూచించినట్లు ఈఘన పరిశ్రమలను 5 రెట్లు వృద్ధి చేస్తామనుకోండి. అప్పుడు 10 మిలియనులమందికి మాత్రమే పని దొరుకుతుంది.మరి మిగిలినవారి మాటేమిటి? రైతుకు పొలంలో సంవత్సరం పొడుగున పని ఉండదుకదా! వ్యవసాయంమీదవచ్చే ఆదాయం బహుస్వల్పం. పొలం పనులులేని రుతువులలో ఏవో కొన్ని చిన్నచిన్న పరిశ్రమలను సాగించుకుంటే మంచిది కాదూ! కాబట్టి కుటీరపరిశ్రమలను దేశమంతటా విరివిగా నెలకొల్పటమే నిరుద్యోగ సమస్యాపరిష్కారానికి అనువైన మార్గం. దేశం మొత్తంమీదం అన్ని గ్రామాల్లోనూ ప్రజలంతా కుటీరపరిశ్రమలను క్రమబద్ధంగా సాగించ

వలసిందే. ఆధునిక ఆర్థిక నిర్మాణానికి కొన్ని-ఘన-కీలక పరిశ్రమలు అవసరం. అవి మాత్రం ప్రభుత్వపు యాజమాన్యంలోనూ, మేనేజిమెంటులోనూ ఉండవలెనని గాంధిజీ అంటాడు.

మన గ్రామస్వరాజ్య రాజ్యాంగంలో కుటీర పరిశ్రమలను ఆర్థికంగా దేశాభ్యుదయ దోహదములు కావేమోనని భియపడవలసిన అవసరంలేదు. ప్రపంచ పారిశ్రామిక శ్రేష్ఠులలో హెన్రీఫోర్డు పేర్కొనదగినవాడు. "సాధారణంగా పెద్ద పెద్ద పరిశ్రమలే ఆర్థికంగా దేశాభ్యుదయకరములు గావు"- అని ఆయన అంటాడు. కాబట్టి యంత్రపరిశ్రమలను కేంద్రీకరించటంలో అర్థంలేదు. "దేశమంతటా అవసరమైన వస్తువును అన్ని ప్రాంతాల్లోనూ ఉత్పత్తి చేయవలసిందే. అందువల్ల రవాణా ఖర్చులు తగ్గుతాయి; ప్రజల్లో కొనుగోలుశక్తి సరిసమానంగా ఉంటుంది. కాని పారిశ్రామిక సంస్థలు చిన్నవై ఉండవలెనని, ప్రజలు కర్షక-కార్మికులుకూడవి వుండవలెననీ ఫోర్డు చెబుతున్నాడు. "అప్పుడు ప్రతి పనివాడూ చాలవరకు స్వతంత్రుడై వుంటాడు; వస్తువులు చౌకధరతో తయారౌతాయి; ఆహారధాన్యాలుకూడా ప్రియంగాఉండవు" "పెద్ద పెద్ద యంత్రపరిశ్రమలకన్నా దేశమంతటా స్థాపితములై, వివిధవస్తూత్పత్తిని చేయగల చిన్న పారిశ్రామిక సంఘాలే ఆర్థికంగా దేశాభ్యుదయదోహదములు"— అని లూయీమమ్‌ఫర్డుకూడా సమర్థిస్తున్నాడు.

పెట్టుబడిదారీ విధానమే పెద్ద యెత్తున యంత్రపరిశ్రమలను కేంద్రీకరించుకుని మాటిమాటికీ ప్రపంచాన్ని ప్రళయభీకర సంగ్రామాల పాలుచేస్తున్నది. యంత్ర పరిశ్రమలకయ్యే అపరిమిత ఖర్చులతోపాటు ఈ అపారనష్ట ధననష్టము కూడా మనం లెక్క వేసుకోవద్దామరి? కాబట్టి ఎటుచూచినా యంత్ర పరిశ్రమలు అర్థికాభివృద్ధి కరములు కానేకావు.

పరిశ్రమల వికేంద్రీకరణమును గూర్చి నా 'Gandhian plan' అన్న గ్రంథంలో పూర్ణంగా చర్చించాను. ప్రస్తుతానికి యీ చర్చ ఇంతవరకు చాలు.

## వికేంద్రీకరణంలోని అంతర్యం

గాంధిజీ ఈ వికేంద్రీకరణ విధానాన్ని సమర్థిస్తున్నది, ఆర్థిక రాజకీయ దృష్ట్యా అధి లాభదాయకమని మాత్రమే కాదు 'నిరాడంబర జీవితము' ఉదార భావం అన్న ఆశయసిద్ధికి కూడా వికేంద్రీకరణ విధానమే దోహదకారి యని

కూడ ఆయనసిద్ధాంతము. "మానవుని చిత్తము అశాంతియుతమైన ఒకశకుంతతము వంటిది. కోరికలు నెరవేరుతూన్న కొద్దీ పెరుగుతూ ఉంటాయి. సంతృప్తి మృగ్యం. హృదయంలో ఆశలకు తావిచ్చినకొద్దీ అవి విశృంఖలములౌతూ ఉంటాయి. అందుకే మన పెద్దలు విషయసుఖాలకు ఒకహద్దు పెట్టారు. సుఖమనేది ఒకమానసిక స్థితియని వారు గుర్తించారు. ఉచితమైన కాయకష్టం చెయ్యటంలోనే నిజమైనసౌఖ్యం, ఆరోగ్యం ఉన్నాయి" అంటూ గాంధిజీ నిరాడంబర జీవితము నైతికంగా, వైజ్ఞానికంగా అవశ్యకమని నిర్ధారించాడు. సుప్రసిద్ధ వైజ్ఞానికుడు ప్రొఫెసర్ ఐన్‌స్టిన్ కూడా అదే అభిప్రాయంతో ఉన్నాడు:

"అధిక సంచయము, అత్యాస, ఆత్మప్రచారము, భోగతృష్ణ – ఇవి అంటే నాకు అసహ్యం. నిరాడంబర – నిష్కల్మష జీవితమే ప్రతివానికీ శారీరకంగా, మానసికంగా ఆరోగ్యకరమైనదని నా విశ్వాసం."

'నిరాడంబర జీవితం' అంటే దారిద్ర్యాన్ని కొనితెచ్చుకోవాలనీ, ఎల్లకాలం కొల్లాయిగుడ్డే కట్టుకుని ఉండాలనీ అర్థంకాదు. గాంధిగారి 'సాధు జీవన విధానం'లో ఐహిక సుఖాలు విలుప్తమైనవి. అంతేగాని ప్రజల కనీస అవసరాలను గురించీ, సుఖాలనుగురించీ ఆయన భావాలు సంకుచితములు కానేకావు. ప్రజల 'జీవన విధానం'లో అభ్యుదయాన్నికూడా ఆయన కాంక్షిస్తున్నాడు.

నిరాడంబరత్వమును అలవరచుకొనటమేగాక ప్రజలు మానవ జీవితపు విలువనుకూడ గ్రహించవలసియున్నది. మానవ జన్మము ఉత్తమమైనది. ధనార్జన ప్రధానలక్ష్యముగా ఉండరాదు. విజ్ఞానముద్వారా మానవత్వము పెంపొందవలెను. ఇదే ఖాదీ ఉద్యమంలోనూ, కుటీర పరిశ్రమల వికేంద్రీకరణములోనూ అంతర లక్ష్యము. పైకిమాత్రము వాటిలో ఆర్థిక – సాంఘిక పునర్నిర్మాణము ప్రధానాశయంగా కనిపిస్తుంది. "ప్రజల సహకార సౌహార్ద్రాలే ఖాదీఉద్యమ ప్రధానలక్ష్యం". ఈ నీతినే మన పూర్వ గ్రామ సంస్థలు ప్రబోధించినవి. ఆధునికయుగంలో మానవుడు కేవలం ధనార్జనపరుడైనాడు. అతనికి ధనమే కావాలి; దేవుడు అక్కర్లేదు. అంతరాత్మలు నశించాక మనకు ప్రపంచ సామ్రాజ్యమైనా అక్కర్లేదు" అంటాడుగాంధిజీ.

కాయకష్టము పవిత్రమైనదిగా ఎంచవలెనని గాంధీజీ సిద్ధాంతం. "ఈనాడు లక్షలాది జనం తమ చేతులను చేతుల్లా ఉపయోగించటం మరచి

పోయారంటే — అది మిక్కిలి విచారకరమైన దుర్ఘటన" "జీవంలేని యినుప యంత్రాలను ఉపయోగిస్తూ ఉజ్వల-జీవవంతములైన మన శరీరాలనే సాటి లేని యంత్రాల్ని తుచ్ఛపర్చి ఆత్మ విధ్వంసకుల మనిపించుకుంటున్నాం" గాంధీజీ దృష్టిలో కాయకష్టమే జీవితం. శ్రమించగల శరీర దార్ఢ్యం వర ప్రసాదమే గాని శాపం కాదు.

గాంధీజీ భావాలకు అహింసాతత్వమే నిరాడంబరత్వము, మానవ సౌభ్రాతృత్వము, కాయకష్టము - మొదలైన ఆదర్శాలకు ఆధారశిల. "ఉన్నత-ఉదారభావాలతో నిరాడంబరంగా వ్యవహరించటమే అహింసా జీవన విధానం."

"గ్రామాల్లో ప్రజలంతా చిన్నచిన్న సంఘాలుగా యేర్పడి, పరస్పరం తమకుతామై చేదోడువాదోడుగా ఉంటూ, శాంతంగా, గౌరవంగా జీవించ గలిగిననాడు అహింసాయుత సాంఘిక వ్యవస్థ నెలకొన్నదని చెప్పవచ్చు... అహింసాపద్ధతిని ఉన్నత నాగరికతా శిఖరాన్ని అందుకోవలెనంటే భారతీయుల 'గ్రామస్వరాజ్యమే దగ్గరదోవ. అది ఆనాడు 'నాటు' పద్ధతిని ఉండినమాట నిజమే. అందులో అహింసావిధానము నేను నిర్వచించిన రీతిగా అనుసరితముకాలేదు" అయితే తత్వము విలుప్తముకాలేదు. కాబట్టి గ్రామమే ప్రాతిపదికగా మన నాగరకతా సౌధాన్ని నిర్మించుకోవాలని గాంధీజీ అభిప్రాయం. "గ్రామస్వరాజ్యంలో ఒక వర్గంవారు మరొక వర్గీయులను పీడించటమంటూ ఉండదు. ఆ పరపీడనమేకదా అహింస అంటే!"

మహాత్ముని దృష్ట్యా అహింసయే ఒక ప్రబలమైన శక్తి. అదే ఉత్తమ జీవన విధానం. "భూమి తలక్రిందులు కాకుండా తన స్థానంలో తాను నిల్చి యుండుటకు ఆకర్షణశక్తి కారణమైనట్లే అహింసా విధానమువలన సంఘము శిథిలంకాకుండా సంఘీభావంతో చిరస్థాయికాగలదు" టి. హెచ్. గ్రీన్ చెప్పినట్లు "రాజ్యాంగమును నడుపవలసినది ప్రజల యిచ్ఛగాని, అధికారం కాదు". హింసావిధానము ఎంత శక్తిహీనమైనదో రెండు ప్రపంచ మహాసంగ్రామాలు రుజువు చేసివెళ్ళాయి. అధ్యక్షుడు ట్రూమన్ చెప్పినట్లు ఇంకో ప్రపంచయుద్ధం దాపరించినట్లాయెనా ప్రపంచ నాగరకతకు తిలాంజలులు విడువవలసినదే. కొత్తకొత్త శాస్త్రపరిశోధనలతో ఉంది ప్రపంచం. మనకీ శాస్త్రపరిశోధనలూవద్దు, హింసావిధానమూవద్దు; ఆరెండూ అనుమగ్లేనని అటంబాంబు బాకా ఊది చెప్పేసింది. అమెరికా ఇంకో మహామారణ

యంత్రాన్నికూడా తయారు చేసిందనీ, దానిముందు ఈ ఆటంబాంబు తాటాకు టపాకాయ వంటిదేననీ, ఇంకోవార్త పొక్కింది. ఇట్టి పరిస్థితులలో మానవజాతి, ప్రపంచనాగరకత చల్లగా ఉండాలంటే అహింసా తత్వంకన్నా అన్యథా శరణం నాస్తి. ఒక ఆటంబాంబుతో ప్రపంచాన్ని అంతనూ నాశనం చేసేందుకు ఉద్యమించటంకంటే ప్రతిచిన్న 'ఆటం' (అణువు)లోనూ విశ్వాన్ని దర్శించగలందులకు ప్రయత్నించటము నుంచిది! అట్టి దర్శనసిద్ధి అలవడనినాడు ప్రపంచం వినాశనము పొందకతప్పదు.

## సాంఘికదృష్ట్యా వికేంద్రీకరణము

గ్రామ ప్రజాసంస్థల వికేంద్రీకరణము సంఘ శ్రేయోభివృద్ధికికూడా సహాయకారి. జన సమ్మర్దముతైన పట్నాలలో కంటే...విశాలముతై, చక్కని గాలి. వెలుతురుగల పల్లెటూళ్లలోనే ఆరోగ్యంబాగా ఉంటుంది. గజిబిజిగా తొక్కిడిగా ఉండే పట్నాల్లో ప్రజల శరీర-మానసిక స్వాస్థ్యం తొందరగా దెబ్బతింటుంది. గ్రామాల్లో వివిధ ప్రజాసంస్థలు పొలాల్లోనూ, కుటీరపరిశ్రమాగారాల్లోనూ, కర్మాగారాల్లోనూ శాంతంగా తమ పని తాము చేసుకుంటూ ఉండవచ్చు. కాయకష్టంవల్ల శరీర దార్ఢ్యం చేకూరుతుంది. సంఘమంతా నిత్య సౌఖ్యానందములతో వికసిస్తుంది.

మానవునికి ఆరోగ్యమేకాక శరీరదార్ఢ్యంకూడ అవసరమే అందుకనే "తిరిగి గ్రామాలకు వెళ్లండోయి బాబులూ" అన్న నినాదం వచ్చింది. కొన్ని దశాబ్దులనించీ పారిశ్రామిక పాశ్చాత్య దేశాల్లో జనసంఖ్య తగ్గుతూ వస్తున్నది. 'జనసంఖ్య పెరుగుతున్నదే, ఏమిచెయ్యాలి?' అన్న సమస్యపోయి ఈనాడు 'జనసంఖ్య క్షీణిస్తుందే, పైగా దుర్బలులు పుట్టుకొస్తున్నారే, ఏమి చెయ్యాలి?' అన్న సమస్య బయలుదేరింది. పట్నవాసులుకన్నా పల్లె ప్రజలే సుదార్ఢ్యంగాఉంటారు. అలాగని సాంఘిక శాస్త్రంకూడా ఒప్పుకుంటున్నది ప్రొఫెసర్ లాన్సులాట్ హాగ్ బెన్ చెప్పినట్లు "పట్నాల్లోని అనారోగ్య పరిస్థితులవల్లా, పిల్లల్నికనవలెనన్న యిచ్ఛను బలహీనము చేయజాలిన అనేక యితర ఆకర్షణలవల్లా సంఘంలో చోరవచేసుకుని వస్తూన్న నూతన జీవన పద్ధతులవల్లా సంతానోత్పత్తి వక్రించింది. యంత్రయుగం మానవులనుకూడా నిర్జీవయంత్రాలనుగా మార్చివేసింది. యంత్రాలకు బిడ్డల్నికనే తాహతు లేదు. మానవజాతికి రానురాను అదేగతిపట్టింది." గ్రామాల్లోపరిస్థితులువేరు జంతుప్రపంచంలో ఋతువు ఋతువునా నూతనసృష్టి నవవికాసంతో

చిందులాడుతూ ఉంటుందే; అలాగే మనుష్య ప్రపంచంలోకూడా నూతన సృష్టి ప్రకృతి లీలగా సాగిపోతూవుంటుంది. కేపిటలిస్టు సంఘానికైనా పట్నవాసమే ప్రధానంకాదు. సోషలిస్టు రాజ్యాలుకూడా 'సంతానోత్పత్తి ప్రణాళికను ఆలోచించవలసిందే.

సాంఘిక-ఐక్యతకూ, సామాజిక క్షేమానికీకూడా గ్రామ సంస్థలే మూలకందాలు. పూర్వకాలంలో మన గ్రామసంస్థలు ఒక్కొక్కటి ఒక్కొక్క కుటుంబంలా ఉండేవి. ఎవరికి ఏకష్టం వచ్చినా అది అందరికీ వచ్చినట్టే భావించేవారు ఎవరి యింట్లోనైనా దొంగలుపడి ఆస్తినష్టం సంభవిస్తే మిగిలినవారంతా ఆ కుటుంబాని నష్టాన్ని భర్తీచేసేవారు. ఎవరి యిల్లైనా పరశురామ ప్రీతి అయితే గ్రామస్థులంతా కలసి ధాన్యం, కలప యిచ్చి మరొక యిల్లు కట్టించి పెట్టేవారు. ఏయింటి యజమానియైనా మరణిస్తే దిక్కులేని అతగాని పిల్లలకు గ్రామస్థులే 'గార్డియను'లయ్యేవారు. పెళ్లిగాని చావుగాని ఎవరి యింట్లో యేదివచ్చినా అందరూ ఆదుకునేవారు. కుటీర పరిశ్రమలవల్లా, ఇతర వృత్తులవల్లా గ్రామప్రజల్లో నిరుద్యోగ పరిస్థితులంటూ ఉండేవేకాదు. స్వల్పంగా ఈర్ష్యాసూయలు, పేచీలు, అప్పుడప్పుడు చిన్న చిన్న కొట్లాటలు సంభవిస్తూ ఉండేవే; కాని మొత్తంమీద గ్రామ సమిష్టి సంఘక్షేమము చెడేదికాదు.

## జీవనానందం

గ్రామ పునరుద్ధరణ జరిగినప్పుడు ప్రజలకు సుఖం, సంతోషం, శాంతి కరతలామలకాలు. ప్రాచీన భారత గ్రామాల్లో ప్రజల వినోదాలు ఎలా వుండేవో డా॥ ముజుమ్‌దారు తన 'Corporate life in Ancient India' అన్న గ్రంథంలో వివరించాడు. వేదకాలంలో 'క్లబ్బు' (గోష్ఠి)లు ఉండేవిట. సాయంత్రమప్పుడు ప్రజలు తమ పనిపాటలు ముగించుకుని ఒక చోట సమావేశమై నృత్యగానాలతోనో, కథలు చెప్పుకుంటూనో, భారత రామాయణాలు ముచ్చటించుకుంటూనో కులాసాగా కాలక్షేపం చేసేవాళ్లు. మౌర్యయుగారంభంవరకూ సెలవు దినాల్లోనూ, పండుగలకూ నృత్య గాన సభలను ఏర్పాటు చేసేవారుట. ఈ వినోదసమయాల్లోనూ గ్రామస్థులంతా ఎంతో సౌహార్ద్రంగా వ్యవహరించేవారు. అట్టి వినోదాల్లో అందరితోపాటు పాలుతీసుకోకపోవటము ఒక పాపంగా పరిగణించేవారు. ఆ పూర్వ - ఆచార సాంప్రదాయాలు మన పల్లెలలో ఈనాటికీ నిల్చియున్నవి ఇప్పటికీ కొన్ని

గ్రామాల్లో సంతలు చేస్తూవుంటారు జానపద నృత్యగానాలతో, వీధినాటక ప్రదర్శనాలతో, కుస్తీపందెములతో, భజన మేళములతో మన గ్రామీణులు జీవనానందమును చూరగొన్నారు.

కల్లాకపట మెరుగని కాయకష్టంలో, నిరాడంబరమైన వినోదాల్లో పల్లెప్రజలు సుఖంగా ఉంటారు. పట్నవాసులు యంత్రాలవలె కృత్రిమ జీవితం గడుపుతూ ఉంటారు; గ్రామఫోను, సినీమా, రేడియో – ఇవీ వారి వినోదాలు – జీవంలేని వినోదాలు. పట్నవాసులు యంత్రవేగాన్ని బట్టి తమ సంచలనాన్ని నియమితం చేసుకుని... ఒకేరకపు కార్యక్రమానికి కట్టుబడి వుంటారు జీవితానికి అవసరమైన ఉత్సాహం వారికి లభించదు. సెలవు దినాల్లో వారు అనుభవించే వినోదాలు కృత్రిమములే. హృదయం మొద్దుబారిపోతూ ఉంటుంది; ఆలోచనలు ఎప్పుడూ ఒకటేరకంగా సాగుతాయి; జీవనానందాన్ని జుబ్బనజూర లాడుదామని తహతహ లాడుతూ ఉంటాడు. కాని చివరకు మృత్యువే అతన్ని 'స్వాహా' అంటుంది.

## కళా – సౌందర్యం

'మాకళ, మాఅందం' అంటూ పట్నవాసులు గొప్పలుపోతూ ఉంటారు. క్రోటనులు పెట్టుకుని అదే ఉద్యానవనం అని భావించే కృత్రిమ జీవనులకళ ఎంత శోభస్కరంగా ఉండేది, ఎంత భావగర్భితంగా ఉండేదీ తేలిగ్గానే ఊహించుకోవచ్చు. డబ్బును ఆరాధించే వారు కళను, సౌందర్యాన్ని 'సర్వేగుణాః కాంచనమాశ్రయన్తే' అన్నదృష్టితోనే అర్థం చేసుకుంటారు. స్వాభావిక ప్రకృతి సౌందర్యం వారుచూచి యెరుగరు. పట్నాల్లో మహా అందంగా ఉన్నాయని చెప్పుకునే అంబరచుంబి సౌధాలు గాలి, వెలుగు చొరని పావురాల గూళ్ళకంటే అధ్వాన్నంగా ఉంటాయి. గ్రామస్తులు చక్కని గాలి, వెలుతురువచ్చే చిన్నచిన్న యిళ్లలో కాపురముంటారు నిత్యమూ ప్రకృతి మాత యొడిలో జీవిస్తుంటారు. చేతిపని వాళ్లు తాము సంఘసేవ చేస్తున్నామన్న ఉత్సాహం అనుభవించగలరు. "కనుక వారు మంచి అందమైన వస్తువులను తయారుచేస్తారు. ఆడుతూ, పాడుతూ తమ పనులు నెరవేర్చుకుంటారు." స్త్రీలుకూడా తెల్లవారుఝామున లేచి ధాన్యం దంచుకుంటూ ఎంతహాయిగా పాడుతారు! చంకల్లో బిందెలు పట్టుకుని 'పొచ్చెంబింతయు లేని హంస నడకలతో' వయ్యారంగా చెరువుకో, బావికో వెళ్లివస్తూంటే పల్లె పడుచులను చూడ ముచ్చట

వేస్తుందికదా! ముంగిళ్లలో వారు రచించే రంగవల్లుల అందం, వారి నృత్యాల్లో, నాటక ప్రదర్శనాల్లో ద్యోతకమయ్యే వాస్తవికత వారి చేతుల మీదుగా తయారయ్యే వస్తువుల్లోని సునితమైన పనితనం ఇవన్నీ మహానాగరికులమని విర్రవీగే పట్నవాసులకు తెలియవు.

భారతదేశము అతి ప్రాచీనమైనది. ఇక్కడ విజ్ఞానము అడవులనుంచి ఆశ్రమాలనించి పట్నాలకు వ్యాపించింది. భారత విజ్ఞానసృష్టికి ఆదిబ్రహ్మలు ఋషులు. వారు చిన్నచిన్న మునిపల్లెలలో శాంతంగా జీవిస్తూ ఉండేవారు. రామాయణ మహాభారతములవంటి మహా కావ్యాలను ఈ ఋషులే గానం చేశారు యూనివర్శిటీ ప్రొఫెసర్లు రాసిన గ్రంథాలు కావు అవి. అమర సృష్టిములనదగిన అజంతా చిత్రాలు ఏ ఆర్టుగ్యాలరీ డైరెక్టర్లో గీసినవికావు. ఒక నూతన కళను సృష్టించేటప్పుడు గలిగే బ్రహ్మానందంలో తన్మయులైపోయి ఆ ఋషిపుంగవులు కీర్తికోసం ప్రాకులాడలేదు. తమ పేర్లనైనా మనకు దిగవిడిచి వెళ్లారుకారు. 'కళకోసమే కళ' అనీ, 'జీవన సమస్యలకోసమే కళ' అనీ వ్యర్థవాదాలు పెంచుకుని వారు కాలక్షేపం చెయ్యలేదు. మానవ జీవితమే ఒక విసిష్టమైన కళగా వారు భావించారు.

జాతీయ రక్షణ

గ్రామ పునరుద్ధరణము, వికేంద్రీకరణము, ఈ రెండు ఆయుధాలతో పరరాజ్యాల దాడులను విజయవంతంగా ఎదుర్కోగలము. ఆధునిక యుద్ధ పద్ధతులను అవి లొంగదీయగలవు. దేశంలో ఏ నాలుగు తావులలోనో మిక్కిలిగా కేంద్రీకృతములైన ఉత్పత్తి యంత్రాగారాలను నాలుగు బాంబులలో నాశనం చేయవచ్చును. దానితో జాతీయ ఆర్థిక సంపద యావత్తూ దెబ్బతింటుంది. కీలకస్థాన వినాశనంతో దేశమంతా చచ్చుబడిపోయుకుంటుంది. ఏ కొద్దిపట్నాల్లోనో కేంద్రీకృతాలైన అధికోత్పత్తి యంత్రాగారాలనే శత్రుబలాలు మున్ముందుగా ధ్వంసంచేసేస్తారు. అలాగాకుండా చైనాలో పారిశ్రామిక సహకార సంఘాలను బహు చాకచక్యంతో నిర్మించారు. అందుచేతనే వాడు ఏళ్లతరబడి సాగుతూవచ్చిన జపానుదాడులను తట్టుకోగలిగారు. వారి 'ఇండస్కోఆపరేటివ్' మూవ్మెంటు చైనా దేశమంతా విరివిగా కుటీరపరిశ్రమలను పాదుకొల్పి సాధ్యమైనంతవరకు అన్ని పల్లెలనూ, స్వయంపోషకములనుగా సముద్ధరించినది. "మాటిమాటికీ శత్రు రాజ్యాల దాడులకు గురి అయే దేశంలోనూ, బహుకాలయుద్ధములలో చిక్కుకొను

వలసిన పరిస్థితులు ఏర్పడేట్టయితేనూ ప్రజాజీవితానికి అత్యవసరాలైన ఆహారపదార్థాలు, గుడ్డలు మొదలైనవి ఏప్రాంతానికి ఆప్రాంతంలో తయారయ్యేలాగు చూడాలి. ఎక్కడో దూరప్రదేశాలమీద ఆధారపడి ఉండటము వినాశనము కొని తెచ్చుకున్నట్టే. మిలిటరీ దృష్ట్యా ఉత్పత్తి పరిశ్రమల వికేంద్రీకరణము అత్యవసరము. అట్టి ఉత్తమ విధానం మన దేశంలో ఒకప్పుడు ఆచరణలో ఉన్నది. ఇప్పుడు దాన్ని మనం వొదులుకోవటం దేనికి?"

## అంతర్జాతీయ సామరస్యం

ప్రపంచ శాంతిభద్రతలకోసం, అంతర్జాతీయ మైత్రికోసం అనేక ప్రణాళికలు సూచితములైనవి. నానాజాతిసమితి అంతర్జాతీయ వివాదాలను సంప్రదింపులద్వారా సమరసంగా పరిష్కరించుకోవాలని ప్రతిపాదించింది. కాని ఫాసిజంవచ్చి నిప్పులు చెరిగింది: నానాజాతి సమితి నీరుగారిపోయింది. మొన్న శాన్‌ఫ్రాన్సిస్కో సమావేశం ప్రపంచశాంతికొరకు మరొక ప్రణాళికను తయారుచేసింది. కాని అందులో మిగతా ప్రపంచంమీద అధికారం చలాయించాలన్న అగ్రరాజ్యాలవారి స్వార్థం నిగూఢమైయున్నది. అంతర్జాతీయ రక్షణదళానికి రష్యా-అమెరికా-ఇంగ్లాండులు అధిపత్యం వహించనున్నా యన్నమాట. కాని దైవత్యా ఈ మిత్రరాజ్యాలవారికే పరస్పరం బెడిసేట్టయితే ఈ అంతర్జాతీయ భద్రతాసంఘం ఏం చేయగలదు?

అంతర్జాతీయ-అరాజకాన్ని అరికట్టేనిమిత్తం ప్రపంచం అంతా ఒకే రాజ్యంగా సమీకరించవలెనని కొందరు రాజకీయవేత్తలు సూచించారు. "అన్నిజాతుల ప్రాతినిధ్యంగల ఒక ప్రపంచ సమాఖ్యను స్థాపించవలెననీ, అన్నిరాజ్యాలవారూ పాటించవలసిన ఒక న్యాయచట్టాన్ని నిర్మించవలెననీ, అన్నిరాజ్యాల రక్షణకోసంగానూ ఒక ప్రత్యేక 'ప్రపంచ పోలీసు దళాన్ని' సమీకరించవలెననీ ఇలైకల్బర్ట్‌సన్ సంయుక్త రాజ్యాలవారికి సలహా యిచ్చాడు. (The price for peace) అన్న గ్రంథంలో సర్ విలియమ్ బెవరిడ్జి "అగ్రరాజ్యాలవారి సైనికనివహాలు అండగా ప్రపంచ వ్యవహారాలను పర్యవేక్షించి సరిదిద్దగల ఒక 'జాత్యతీత అధికారసంస్థ' (Super-national authority) ను నెలకొల్ప వలసిందని ప్రతిపాదించాడు. సమ్నర్ వెల్సుకూడా "సకల రాజ్యాల ప్రాతినిధ్యంగల ఒక ప్రపంచ సంస్థను నిర్మించవలె" నని అత్రత ప్రకటించాడు. ఈసూచనలన్ని ప్రపంచజాతుల

సమిష్టి క్షేమాన్నీ, ఆయుధ విసర్జననూ ఆకాంక్షిస్తున్నవి కాని ఆసూచనలను చేసిన పెద్దలెవరూ సమస్యను సరియైన దృక్పథంలో పరిశీలించలేదు.

ప్రపంచ మంతటా వర్తక ప్రాబల్యం సంపాదించి, పరదేశాల సంపత్తిని కొల్లగొట్టవలెనన్న అత్యాశయే యుద్ధాలకు మూలకారణం అందరికీ తెలును ఈవిషయం. మొన్నటియుద్ధం ముగిసిన వెంటనే మిత్ర రాజ్యాలవారు తమ పరిశ్రమలను వృద్ధిచేసుకుని, స్వదేశంలో ప్రజల జీవన ప్రమాణాన్ని పెంచవలెనని ఆతృతపడుతున్నారు. అందుకు అనుగుణ్యంగా ఆర్థిక ప్రణాళికలు తయారు చేసుకుంటున్నారు. ఎవరికివారు తమ పరిశ్రమలను వృద్ధిచేసుకోవాలని ప్రయత్నించటంలో ఈ మిత్రరాజ్యాలవారికి పరస్పరం పోటాపోటీలు ఏర్పడక తప్పదు దీని పర్యవసానం మూడవ ప్రపంచయుద్ధమే. దానివల్ల మళ్లీ లోకంలో ఎంత వినాశనకాండ జరుగనున్నదో ఊహించుకుంటే వొళ్లు జలదరిస్తుంది మళ్లీయుద్ధం రాకుండా ఉండాలంటే పెట్టుబడిదారీ విధానమూ, దానిచెల్లెలు సామ్రాజ్య విధానమూ ముందుగా అంతరించాలి. "ఏరాజ్యాని కారాజ్యం తనకుతాను శాంతంగాఉంటే అన్నిరాజ్యాలమధ్యా శాంతిపరిస్థితులే నెలకొంటాయి."— అన్నాడు ప్రొఫెసర్ లాస్కీ. రాజ్యంలో శాంతి నెలకొనవలెనంటే దేశ సంపద సక్రమంగా పంపకం కావాలి. పరస్పర సహకారము ప్రాతిపదికగా పారిశ్రామిక సంస్థలను వికేంద్రీకరించినప్పుడే అది సాధ్యమౌతుంది. కుటీర పరిశ్రమలద్వారా ప్రతిగృహమూ స్వయంపోషక మైనప్పుడు అశాపాతకపు సామ్రాజ్యదాహం అంతరిస్తుంది. అప్పుడు అంతర్జాతీయ సామరస్యం సిద్ధిస్తుంది. కాబట్టి మనం ముఖ్యంగా చేయవలసినపని ఆయుధ విసర్జనము కాదు; పెట్టుబడిదారీ విధానమునకు కళ్లెం ఊడగొట్టాలి. "పెద్ద పెద్ద రాజ్యాలలో స్వదేశాభిమానం గలిగి పరిశ్రమింపగల స్థానిక సంస్థలు ఎన్ని ఎక్కువగా ఉంటే అంత తగ్గిపోగుండి, పరరాజ్యాలపైపడి పీక్కుతినాలన్న అకలి."

## డాక్టరుగారూ, మీరే మందుతినాలి!

ఈ వికేంద్రీకరణ విధానమును మిత్రరాజ్యాలవారు ఓడిపోయిన జర్మనీలో ప్రవేశపెట్టటం చాల విచిత్రంగాఉంది. "ప్రజాస్వామ్య పద్ధతులపై జర్మనీలో స్థానిక స్వపరిపాలనము నెలకొల్పవలెననీ, శాంతియుతముగా వ్యవసాయమును, కుటీరపరిశ్రమలను పెంపొందించవలెననీ" పోట్స్‌డామ్ సమావేశంలో "ముగ్గురు పెద్దలు" నిర్ణయించారు. ఎవరేమనుకున్నా

నేనుమాత్రం... ఈవిధమైన వికేంద్రీకృత రాజకీయ – ఆర్థిక పాలనము చిర శాంతినీ, ముక్కోటి సిరిసంపదలనూ ప్రసాదించగలదని...గట్టిగా నమ్ముతున్నాను. హింసావిధానమును అంతుచూచిన దేశంలో 'శాంతియుత కుటీర పరిశ్రమల సంస్థాపనము గమనించదగినది. కాని విచారణీయాంశము ఏమంటే ఈవికేంద్రీకరణ విధానం జర్మనీలో ప్రరూఢమైనదికాదు. దాన్ని బైటినించి తెచ్చి వారిపై రుద్దుతున్నారు. అంతమాత్రాన విశేషలు పొందగలమనక్కర్లేదు. 'డాక్టరుగారూ, మీ కేమందులు తినాలండోయి' అని నేను మిత్రరాజ్యాల వారిని ఉద్దేశించి బిగ్గరగా చెబుతాను. వికేంద్రీకరణమనే ఈనూతనవ్యవస్థను వారే తమ స్వదేశాల్లో అమలుపరిస్తే పరరాజ్యాక్రమణ నశించి, ప్రపంచ శాంతి చేకూరుతుంది. లేకపోతే ప్రపంచం మరొకసారి అసాధారణ వినాశన కాండకు ఆహుతి కావటిసిందే, తప్పదు.

"జర్మనీని శాశ్వత దాస్యంలో ఉంచేనిమిత్తం మిత్రరాజ్యాలవారు అవలంభించిన విధానాన్ని మీరు భారతదేశంలో ప్రవేశపెట్టాలని వాంఛిస్తున్నారేమి?"—అని విమర్శకులు నన్ను ప్రశ్నించవచ్చు. అందుకు నా సమాధానం ఇది. "వికేంద్రీకరణ పద్ధతి మనకు సర్వథా స్వజాతీయము. స్వతంత్రభారతదేశం దాన్ని బుద్ధిపూర్వకంగా స్వీకరించే పక్షంలో అది స్వశాంతికీ, పైపెచ్చు పరదేశాలకు శాంతిభిక్ష ప్రసాదించటానికికూడా సమర్థము. జర్మనీ అంటే పీడితదేశమై పోయిందాయెను. అవమానం భరించలేక మళ్లీ పూర్వపు మిలిటరీ శక్తిని సమీకరించుకుని, హింసాకాండద్వారా ప్రపంచాన్ని కబళించేందుకు నిత్యమూ చాటుమాటున కృషిస్తూనేఉంటుంది. అలాంటి తతంగాలు మనదేశంలో అసంభవం. పైగా భారతదేశము అట్టి రాజ్యాంగంవల్ల స్వయం జ్యోతియై... పెట్టుబడిదారీ – సామ్రాజ్యతత్వాల మహాంధకార వాతావరణంలో మగ్గుతూన్న పరదేశాలకు వెలుగునిచ్చి... మార్గదర్శికాగలదు. మనం ఒక దేశాన్ని పీడించము; ఒకదేశం మరోదేశాన్ని పీడిస్తూంటే ఊరుకోము.

## ఇదిపాతకాలపు విధానమా?

ఈ విధానము అభ్యుదయ నిరోధకమనీ, తద్వారా మనం మధ్యయుగానికి వస్తున్నామనీ...కొందరు బుద్ధిమంతులు గాంధీజీని విమర్శిస్తున్నారు. ఈవిమర్శలకు అర్థంలేని అపోహాలే కారణం. గ్రామసభలు పరస్పర సంబంధమేమీలేని ప్రత్యేక సంస్థలని గాంధీజీ అనటంలేదు. అట్టి సరిస్థితి

సంభవమూకాదు, వాంఛనీయమూకాదు. గ్రామస్వరాజ్యంలో పల్లెటూళ్లన్నీ 'యూనిట్లు'. ఆర్థికంగా, రాజకీయంగా, సాంఘికంగా సర్వతంత్ర స్వతంత్రం అనుభవించగలవు. గ్రామాలన్నీ తాలూకాలుగాను, జిల్లాలుగాను, రాష్ట్రాలుగాను, అఖిలభారత కేంద్రంగాను తాలూకా-జిల్లా రాష్ట్రీయ పంచాయతీల ద్వారాను, కేంద్ర ఫెడరల్ పార్లమెంటు ద్వారాను సమీకృతము లౌతాయి.

ప్రాచీన కాలంలోగాని, మధ్యయుగంలోగాని ఈ గ్రామసంస్థలు పరస్పర సంబంధంలేని ప్రత్యేకసంస్థలుగా ఉండేవని అనుకోటం పొరపాటు. మనుస్మృతి – మహాభారతము – కౌటిల్యుని అర్థశాస్త్రము – ఇంకా కొన్ని సంస్కృత గ్రంథాలలోనూ...ప్రతిగ్రామానికీ, పది గ్రామాలకూ, ఇరవై గ్రామాలకూ, నూరు గ్రామాలకూ, వెయ్యి గ్రామాలకూ ఒక్కొక్కరుగా ప్రత్యేక ఆఫీసర్లు ఉండేవారనీ, ప్రతి ఆఫీసరూ తనక్రింద ఆఫీసర్ల కార్యకలాపాల్ని పర్యవేక్షిస్తూ ఉండేవాడనీన్నీ రాసివున్నది. సమిష్టిక్షేమానికి భంగకరంకాకుండా ప్రతి గ్రామమూ సర్వతంత్ర స్థానిక స్వపరిపాలనము ననుభవించేది. ఈ గ్రామసంస్థలు ఒకదానిపై మరియొకటి కలుపుకుపోయిన అనేక రాతిపొరలుగా 'ఫెడరల్' పద్ధతిని పెద్దపెద్ద రాజ్యాంగ సంస్థలుగా బలపడుతూ చివరకు దుర్భేద్యమైన మేరుపర్వతము వంటి ఉత్తమ – ప్రజారాజ్యంగా...పరిణతి నొందినది. ఒకదానిపై ఒకటిగా ఏర్పడిన ఈ రాజ్యాంగ సంస్థలను సభ, మహాసభ, సత్తర్ అను నామములతో వ్యవహరించే వారని డా॥ రాధాకుముదముఖర్జీ చెబుతున్నాడు. ఈరాజ్యాంగము రాజరాజు కాలంలో చోళసామ్రాజ్యమందు అమలులో ఉండినదని అనేక శాసనాలవల్ల తెలుస్తున్నది.

ఈరాజ్యాంగంలో ఊరుగాని, నగరంగాని ప్రాథమిక యూనిట్‌గా ఉండేది. దానిపైది 'నాడు'. ఆపైది 'కోత్తం'. అంతకన్నా పైది 'మండలం'. కే. పి. జయస్వాల్ తన 'Hindu Polity' అన్న గ్రంథంలో 'జానపద రాజ్యాంగాన్ని గూర్చి వివరించాడు. అందులో ప్రాంతీయ సంస్థలన్నిటికీ ప్రాతినిధ్యం ఉండేదట. ఈ అంశాలనుబట్టి చూస్తే – మన 'గ్రామస్వరాజ్యం' ఫెడరల్ పద్ధతిని నిర్మితమైన అఖిలభారత రాజ్యాంగమేనని తెలుస్తున్నది. ప్రస్తుత కాలంలో ఈ వివిధరాజ్యాంగ సంస్థల సమీకరణము ఎంతో జాగరూకతతో సాగించుకోవలసియున్నది. పరిపాలనాధికార వికేంద్రీకరణమూ ప్రధానంగాగల ఆనాటి రాజ్యాంగమే భావిభారత రాజ్యాంగ నిర్మాణమునకు పునాది. దాన్ని 'పాతకాలపు విధానం' అని

త్రోసిరాజనకూడదు. అదే మున్ముందు అన్ని దేశాలకూ ఆదర్శప్రాయము గలది. "మళ్ళీ మనం గ్రామాలవైపు మళ్ళవలెనంటే అనాగరికులపై పోవటమని అర్థంకాదు. అలా చేస్తేనే మనకొక చక్కని జీవనవిధానం అలవడుతుంది. అట్టివిధానమే ఒకప్పుడు భారత జాతికి జీవం, వికాసం ఇచ్చింది. మన నాగరికత పెంపొందటానికి అదేమార్గం. నిరాడంబర వ్యావసాయిక జీవితముతో గ్రామసంస్థలతో, మునిపల్లెలతో, ఆరణ్యక రుష్యాశ్రమాలతో కళకళలాడిన మనభారతదేశం ప్రపంచానికి గొప్ప విజ్ఞానాన్ని ప్రసాదించింది; ఎవరినీ హింసించలేదు; ఏదేశాన్నీ పీడించలేదు; ఇతర జాతులపై ఎక్కి స్వారీ చేయాలనుకోలేదు" — అంటాడు డా॥ రాధాకృష్ణన్.

విమర్శించటం 'ఒక ఫేషన్' అని భావించేవారు ఇప్పటికీ గాంధీజీని 'పాతకాలం మనిషి' అని అభిశంసించేటట్లయితే వారికి నా సమాధానం ఇది: "అబ్బాయిలూ! ఆపాతకాలపు తత్వమే మన ఆధునిక పద్ధతులకన్నా వెయ్యిరెట్లు నయం. పరరాజ్యపీడనము, వలసదేశాలపై స్వార్థయుత ధర్మకర్తృత్వము, సామ్రాజ్యదాహము, ఆత్మవిధ్వంసక సంగ్రామాలు — ఇవేగా ఆధునిక పద్ధతులంటే! ఇలాంటి ఈ ఆధునిక భౌతిక నాగరకత అభ్యుదయమని మీరు అనేటట్లయితే... రామరామ! ఆ అభ్యుదయానికీ మీకూ ఒక దండం."

## అంతర్జాతీయత్వం : విశ్వమానవత్వం

అంతర్జాతీయత్వాన్ని గురించి బడబడా వాగేస్తూ ఉంటాం; గాంధీజీ గ్రామతత్వాన్ని (Villagism) పరిహసిస్తూ ఉంటాం. అదొక ఫేషన్ ఐపోయింది. నిజానికి గాంధీజీ అంతర్జాతీయత్వాన్ని దాటి ఇంకా ముందుకు పరిక్రమించాడన్న సంగతి గమనించలేక పోతున్నాం. ఆయన అంతర్జాతీయ సామరస్యమే కాదు, విశ్వమానవ సౌహార్దాన్ని కూడా ఆకాంక్షిస్తున్నాడు. గ్రామంలో, రాష్ట్రంలో, దేశంలో, ప్రపంచంలో...మనతోటి మానవులందరితోనూ ఒకటిగా ఉండాలి మనం; అంతేగాక ఈ బ్రహ్మాండమంతా కూడా మనకు వేరైనవస్తువు కాదన్న తత్వాన్ని అనుభవంలోని తెచ్చుకోవాలి. ఈతత్వానుభూతికోసం భూమ్యాకాశాలు తిరిగే అవసరంలేదు. మన చిన్నకుటీరంలో మనం ఉండి ఆ యనుభూతిని పొందవచ్చును. అంతర్జాతీయత్వం గాని, విశ్వమానవత్వం గాని దేశకాలాల నతిక్రమించిన ఒకమానసిక స్థితి. గ్రామస్థుడైయుండికూడా విశ్వసాక్షాత్కారము పొందవచ్చును. మన భౌతిక జీవితమునకు గ్రామమే పీఠం; ఆధ్యాత్మికజ్ఞానసముపార్జనకు విశ్వమే

కళాపీఠం - అని గాంధీజీ అభిప్రాయం. ఆయన స్వదేశీ ఉద్యమంలోని అంతర్యం అదే. గాంధిజీ తన ఇరుగు పొరుగు వారికీ, తన దేశానికీ సేవకుడై తద్వారా సమస్త మానవజాతికీ, విశ్వానికంతకూ సేవకుడు కాగోరుతున్నాడు. "నా దేశభక్తి అంతరమూ, బాహ్యమున్నూ. అంతరమంటే - నా మాతృదేశాన్ని శాయశక్తులా సేవిస్తా నన్నమాట. బాహ్యమంటే - ఇతర్లతో నేను పోటాపోటీలు వేసుకునేది లేదు. వారితో నేను వైరంపూనేది లేదు. ప్రతిజీవరాసితోనూ నా ఐక్య భావాన్ని గుర్తిస్తాను."

## నూతన నాగరకత

ఇంతకూ చెప్పవచ్చేదేమంటే - గాంధిజీతత్వం నవ్యప్రపంచ నాగరకతకు మూలకందం. ఆధునిక నాగరకతలోని అనర్థాలను నిర్మూలించేందుకు అనేకమంది అనేకమార్గాలు సూచించారు. కాని అవన్నీ హింసావిధానంపై ఆధారపడినవే. "ప్రపంచమంతా అధిసత్యం వహిద్దామని ప్రయత్నిస్తూన్న ఈనాటి పార్టీల ప్లానులు పలురంగుల చొక్కాలు తొడుక్కుంటున్నా ప్రయోగించే కత్తులు మాత్రం ఒకే ఒరలోనించి తీస్తారు. వారి సిద్ధాంతాల్లో భేదాలున్నా మూలతత్వం ఒక్కటే. యుద్ధానికి వెడుతూ వాళ్లుపాడే పాటల్లో అక్కడక్కడ మాటలు మాత్రమే రవంత భేదిస్తాయి" - అంటాడు వాల్టర్ లిప్ మన్. "ఉత్పత్తిశక్తుల కేంద్రీకరణము వారి ఆయుధం. నిర్బంధ విధానమే ప్రజల దుఃఖదారిద్ర్యాలకు ఔషధమని వారి సిద్ధాంతం. నియంతృత్వ ప్రభుత్వాధికారంలో ప్రజలకు సౌఖ్యం చేకూరుతుందని వారి ఉద్బోధ" సర్వం ప్రభుత్వాధికారంలో ఉండిపోవాలని ఈనాటి నినాదమైపోయింది. ఒక పెద్ద సముద్ర తరంగంలా అది పయనిస్తున్నది. దాన్ని వ్యతిరేకించిన వాణ్ణి "అభివృద్ధి నిరోధకుడనీ, ఏటి కెదురీదేరకం" అనీ నిందిస్తున్నారు. కొన్ని దశాబ్దులనించీ అహింసాతత్వమునూ, వికేంద్రీకరణ విధానమునూ ప్రబోధిస్తున్న వ్యక్తి ఒక్క గాంధిజీ. ఆయనది సర్వధా ప్రాచ్యదృక్పథం, మతభ్రగాహ్యం, ప్రతిభావంతం, వాస్తవం. రాధాకమల ముఖర్జీ ఏమంటున్నాడంటే:

"ప్రాచ్యదృష్ట్యా మనం కోరే భవిష్యద్రాజ్యాంగం నలుగురు ప్రజ్ఞావంతుల యొక్కగానీ, పెట్టుబడిదార్ల యొక్కగాని అల్పసంఖ్యాక పరిపాలన కాదు; ఒకానొక వర్గీయుల నియంతృత్వం కాదు కొలదిమంది వర్గీయుల ప్రత్యేక హక్కులనుమాత్రం సంరక్షిస్తూ, అమాయకులైన నోరువిప్పలేని కష్టా

లేమిటో బైటికిచెప్పుకోనుకూడా చాతగాని లక్షలాది సామాన్య ప్రజలపై దౌడుతీసేటువంటి ఈ రకపు రాజ్యాంగాలు మనకక్కర్లేదు. మనకు కావలసినది రైతుప్రజాస్వామ్యం, గ్రామంనించి కేంద్రం వరకూ ఒకదానిపై ఒకటి స్థానిక స్వపరిపాలన సంస్థలు నెలకొంటాయి. ఇవన్నీ కేంద్రజాతీయ పరిషత్తులో సమీకృతము లౌతాయి చివరకు; ఇలాంటి ప్రజాస్వామిక ప్రభుత్వం మన గ్రామాల పూర్వపు ఔన్నత్యాన్ని పునరుద్ధరిస్తుంది. ప్రజలు పరస్పర సౌహార్ధముతో సుఖాయువులను ఆస్వాదించగలుగుతారు."

గాంధీజీ ఈ నూతన నాగరికతను 'రామరాజ్యం' అని నిర్వచించాడు అందును గురించి ఆయన భావాలను ఇటీవల ఒక స్టేటుమెంటులో ఇలా వ్యక్తీకరించాడు:

"రామరాజ్యాన్ని ఆధ్యాత్మిక దృష్ట్యా 'దైవరాజ్యం' అని నిర్వచించవచ్చును. రాజకీయ దృష్ట్యా అది జాతి-మత-కుల-వర్ణ-లింగ-ధన వ్యత్యాసాలకు తావులేని ఒక విశిష్ట ప్రజాస్వామికమని నిర్వచించవచ్చును. ఈ రాజ్యాంగంలో భూమి, పరిపాలన అంతా ప్రజల ఆధీనం; కాలయాపన, ధనవ్యయం లేకుండా న్యాయం జరుగుతూ ఉంటుంది. వాక్-మత-పత్రికా స్వాతంత్ర్యాలు ఉంటాయి. ఈ రాజ్యాంగం సత్యాహింసలు ఆధారంగా నడుస్తుంది. గ్రామాలు, గ్రామ సంస్థలు స్వయంసమృద్ధలై ఉంటాయి. సిరి సంపదలు, సుఖశాంతులు తాండవిస్తాయి"

అలాగ గాంధీజీ ప్రతిపాదించిన 'రామరాజ్యం' ఒక అద్భుతస్వప్నం కాదు. సర్వధా అది అనుసరణయోగ్యమేనని నేను నమ్ముతున్నాను. స్వదేశంలో ఆర్థిక తరతమ విభేధాలు నశించడానికీ, అంతర్జాతీయ సంగ్రామాలు మరి పొడచూపకుండా ఉండేందుకూ 'రామరాజ్యమే' శరణ్యం. అది కేవలం ఒక స్వప్నం అని పరిహసించే పెద్దలు ఒక్కసారి ప్రపంచ సంగ్రామాల హింసాకాండను ఊహించుకుంటారు గాక! అట్టి ప్రళయభీషణ యుద్ధాలు రాకుండాలంటే మన ప్రస్తుత ఆర్థిక రాజకీయ విధానాలను పూర్తిగా పునాదులతోసహా తిరుగతోడి పారెయ్యాల. ఏవేవో అభ్యుదయకరపథలంటూ ముందుకు వస్తూన్న ప్రణాళికలతో ప్రయోజనంలేదు. సర్ విలియమ్ బెవరెడ్జి అన్నట్టు "మనకు కావలసింది ఆదర్శమా? యదార్థమా?" అని కాదు. "మనకు కావలసింది ఆదర్శమా? నరకమా?" అని. మరి నరకాన్నే కోరుకుందామా,

గాంధీజీ ఆదర్శాన్ని కావాలందామా? కాలయాపన చెయ్యకుండా ఏదో కోరుకుని, ఒక నిర్ణయానికి రావలసిన సమయం ఏతెంచింది. ఆలశ్యం చేసినా తప్పుత్రోవత్రొక్కినా ప్రపంచవినాశన కారణములైన శక్తులు పూర్తిగా విజృంభించాక అప్పుడు వస్తాయిస్తే లాభంలేదు.



# 5

# ప్రాథమికహక్కులు, విధులు

ఈ గ్రంథము మొదటిభాగంలో స్వతంత్రభారత రాజ్యాంగ నిర్మాణానికి అవసరమైన ప్రాతిపదిక సూత్రాలను వివరించాను. ఇప్పుడీ రెండవ భాగంలో అట్టి రాజ్యాంగంలోని వివిధశాఖలను గూర్చిన ప్రధాన అంశాలను సూచిస్తాను. వివిధ వివరాలను విస్తృతంగా చర్చించే బాధ్యత రాజ్యాంగ వేత్తలకు విడిచిపెడుతున్నాను నేను సూచించిన ప్రధాన అంశాలను వారు గమనించటమే నాకు కావలసింది. ఈ నా రాజ్యాంగ ప్రణాళిక బ్రిటిష్ సామ్రాజ్యంతో సంబంధంలేని స్వతంత్ర భారతావనికేనని గుర్తు ఉంచు కోవాలి.

ప్రాథమిక హక్కులను గురించి ఆలోచిద్దాం. మత సమస్యలు పెచ్చు మీరిపోయిన దేశం మనది. కాబట్టి అల్పసంఖ్యాకులకు ఇబ్బందులు కలిగించ కుండా జనసామాన్యపు హక్కులెట్టివిగా ఉండవలెనో మనము అవశ్యం నిర్ణయించుకోవాలి,

1. జాతి – మత – కుల – వర్ణ – లింగ – ధనిక – దరిద్ర విచక్షణలేకుండా ప్రజలంతా ప్రభుత్వపు దృష్టికి సమానులు.

2. ఉద్యోగ్యతకుగాని, సాంఘికగౌరవానికిగాని, వర్తకవాణిజ్య సౌకర్యాలకుగాని జాతిమత కులాలు అభ్యంతరములు కారాదు.

3. అహింసావిధానాన్ని, నైతిక సూత్రాలనూ అనుసరించి ప్రతి వ్యక్తికీ సంపూర్ణ మత – వాక్ స్వాతంత్ర్యాలు ఉంటాయి స్వేచ్ఛగా నలుగురూ ఒకచోట సమావేశంకావచ్చు, ఇష్టంవచ్చినట్లు అన్ని విష యాలూ చర్చించుకోవచ్చు.

4. ఎవని అంతరాత్మ - ఆదేశానుసారం వాడు నడచుకోవచ్చు ప్రజా నైతికశాంతి పరిస్థితులకు అనుగుణ్యంగా ప్రతివ్యక్తి తనసొంత. సాంఘిక ఆచారాలను అనుష్ఠించు కోవచ్చు.

5. అన్ని ప్రాంతాలవారూ తమ భాషను, లిపిని, సంస్కృతిని నిరాక్షేపణగా పెంపొందించుకోవచ్చు.

6. ప్రభుత్వంగాని, లోకల్ ఫండు శాఖవారుగాని ఏర్పరచిన - ఎవరైనా వ్యక్తులు ప్రజోపయోగార్థం అంకితం చేసిన - బావులు, చెరువులు, రోడ్లు, స్కూళ్లు, పార్కులు, గ్రంథాలయాలు మొదలైనవాటిని ఉపయోగించుకు నేహక్కు పౌరులందరికీ సమానంగానే ఉంటుంది.

7. ప్రాథమిక విద్యాశిక్షణ ఉచితంగాపొందే హక్కు ప్రతివానికీ ఉంటుంది.

8. తనకుగాని, తన ఆస్తికిగాని ప్రమాయం సంభవించనున్నప్పుడు పోలీసు రక్షణను పొందగల హక్కు ప్రతివానికీ ఉంటుంది.

9. సుఖజీవితానికి కావలసిన కనీసవేతనము ప్రతిపనివానికీ లభించి తీరవలసిదే.

10. పనివాళ్లనుగాని, ఉద్యోగులనుగాని రోజుకు ఎనిమిది గంటలు మించి పనిచేయించరాదు. ప్రతిపౌరునికీ తగినంత విశ్రాంతి అవసరం

11. ప్రతిపౌరునికీ వైద్య సౌకర్యములలో లోపం జరుగరాదు. (తప్పనిసరిగా ప్రతివాడూ టీకాలు పొడిపించుకోవాలి అంటూ ప్రస్తుతం అమలులోవున్న నిర్బంధ విధానాలను ఉచితరీతిని సంస్కరిస్తారు.)

12. వయోజనులందరికీ వోటు ఉంటుంది. ఆవోటుద్వారా స్త్రీ పురుషులందరికీ ప్రజాపరిపాలనలో తమ బాధ్యతలను నిర్వర్తించుకోవచ్చు.

13. ప్రభుత్వపు నిబంధనలను అనుసరించి ప్రతివాడూ ఆయుధాలను ఉంచుకోవచ్చు; ధరించవచ్చు.

## విధ్యుక్తాలు

పై హక్కులను అనుభవింపదలచుకున్న పౌరుడు ఈక్రింది విధ్యుక్తాలను నిర్వహించవలె.

1. స్వదేశంలో శృతిమించిన పరిస్థితులేర్పడినప్పుడూ, పరదేశాలవారు దండెత్తివచ్చినప్పుడూ ప్రజలంతా ప్రభుత్వాన్ని అంటిపెట్టుకుని, విశ్వాసంతో ఉండాలి.

2. చట్టముల ననుసరించి ధనరూపంలోనూ, వస్తురూపంలోనూ, కాయకష్టంద్వారా ప్రభుత్వానికి పన్నును సమర్పిస్తూ దేశక్షేమమునకు ప్రతిపౌరుడూ పాటుపడాలి

3. ఒకడు మరొకడిని ఆర్థికంగా పీడిస్తూంటే, అట్టి అన్యాయాన్ని ప్రతివాడూ నిరోధించాలి. అట్టిచర్యలు జరుగనీయరాదు.

# 6

# గ్రామమే ప్రాథమిక యూనిట్

స్వతంత్ర భారతావనిలోని రాజ్యాంగానికి స్వయంసమృద్ధములు, స్వపరిపాలనయుతములు అయిన గ్రామాలే ప్రాథమిక యూనిట్లు. ఇదే గాంధీజీ అభిప్రాయమైనట్లు ఇదివరకే సూచించాం. అట్టి విధానము మన పూర్వ సంప్రదాయాలకు అనుగుణమైనది. గ్రామాలు మరీ చిన్నవైతే దగ్గరదగ్గరగా ఉన్న కొన్నింటిని కలిపి ఒక యూనిట్‌గా పరిగణింప వచ్చును.

## పంచాయతీ

ప్రతిగ్రామమూ 'వోటు' పద్ధతివి అయిదుగురు పెద్దలను ఎన్నుకోవలె. వారే పంచాయతి సభ్యులు. పెద్దపెద్ద గ్రామాలలో ఈసంఖ్య పదకొండువరకూ పెరగవచ్చును. ఈ పంచాయతీ సభ్యులు తమలో ఒకర్ని అధ్యక్షునిగా ఎన్నుకుంటారు. ఈ ఎన్నిక ఏకగ్రీవంగా జరగాలి. అట్లు ఏకగ్రీవంగా జరిగేందుకు వీలులేకపోతే గ్రామంలో వయోజనులంతా ఆ అయిదుగురు సభ్యులలోనించి అధ్యక్షుని ఎన్నుకోవలసి వుంటుంది.

పంచాయతీల కాలపరిమితి మూడు సంవత్సరాలు. ఆ తరువాత కొత్తయెన్నికలు జరుగుతాయి. ఒకేవ్యక్తి వరుసగా మూడుసార్లు మాత్రమే పంచాయతీ సభ్యుడుగా నిలువవచ్చును. మూడు తడవలకు మించి పనికిరాదు. పంచాయతి కాలపరిమితి లోపుననే ఏ సభ్యుడైనా గ్రామప్రజల విశ్వాసాన్ని గోల్పోవడం సంభవిస్తే 75 శతాంశల మెజారిటీ 'వోటు'తో అతన్ని తొలగించవచ్చును.

చాకీదార్లను, కరణాలను, పోలీసు కర్మచారులను నియమించడానికి సస్పెండు చేయటానికీ, బర్తరఫ్ చేయటానికీ సర్వాధికారాలూ గ్రామపంచాయితీకి ఉంటాయి.

అన్ని విషయాల్లోనూ. ముఖ్యంగా అల్పసంఖ్యాకుల హక్కుల విషయంలో ఈ పంచాయితీ నిర్ణయాలు సాధ్యమైనంతవరకు ఏకగ్రీవములుగా ఉండవలె.

## పంచాయతీ విధులు

ప్రతిగ్రామమూ సర్వతంత్రస్వతంత్రం అనుభవించవలె. కాబట్టి ప్రజల సాంఘిక రాజకీయార్థిక జీవన క్షేత్రములలో పంచాయతీలు నిర్వహించవలసిన విధులు చాలా ఉంటాయి:

1. విద్య :- (a) వృత్తిద్వారా విద్యగరపే ప్రాథమిక పాఠశాలను నెలకొల్పాలి. వైజ్ఞానిక-సాంకేతిక విద్యలను సమ్మేళన చెయ్యగల విధానం అవలంబించాలి.

   (b) ఒక గ్రంథాలయము, పఠన మందిరము స్థాపించాలి. గ్రామంలోని సాంఘిక-ఆర్థిక-రాజకీయ పరిస్థితుల అభ్యుదయ మార్గాలను ప్రబోధించే పుస్తకాలను ఎక్కువగా గ్రంథాలయంలో కూర్చాలి.

   (c) వయోజనులకోసం ఒక 'రాత్రి పాఠశాల'నుకూడా నడపాలి.

2. ఆట పాటలు :- (a) శరీర వ్యాయామాలకి తాలింఖానాలను ఆటస్థలాలను నెలకొల్పాలి. జాతీయములైన ఆటలను ప్రోత్సహించాలి.

   (b) కళా ప్రదర్శనాలను, పారిశ్రామిక ప్రదర్శనాలను అప్పుడప్పుడు యేర్పాటు చెయ్యాలి.

   (c) అన్నిమతాలవారూ కలిసి సమిష్టిగా తమతమ పండుగలను, ఉత్సవాలను జరుపుకోవాలి.

   (d) నియమిత ఋతువులలో సంతలను ఏర్పాటుచెయ్యాలి.

   (e) భజన సమాజాలను, నగర సంకీర్తనలను సమకూర్చాలి.

   (f) జానపద గీతాలను, జానపద నృత్యాలను, గ్రామీణనాటకసమాజాలను ప్రోత్సహించాలి.

3. రక్షణశాఖ:-(a) బందిపోటు దొంగలనించీ, అడవి జంతువులనించీ వల్లె ప్రజలను కాపాడేందుకు 'గ్రామరక్షణశాఖ' ఏర్పడాలి.

(b) ఆత్మ రక్షణకోసమూ, శత్రువు నెదుర్కొనేందుకూ అహింసా-సత్యాగ్రహ - విధానాలలో ప్రజలను క్రమబద్ధమైన శిక్షణ ఇవ్వాలి.

4. వ్యవసాయము:- (a) సాగుబడి జౌతున్న పొలాలకు శిస్తు నిర్ణయం చెయ్యాలి.

(b) భూ ఆసాములదగ్గర శిస్తు వసూలు చెయ్యాలి.

(c) సమిష్టి వ్యవసాయపద్ధతిని ప్రోత్సహించి అమలు చెయ్యాలి.

(d) నీటిపారుదల వసతులను ఏర్పాటు చెయ్యాలి.

(e) కోఆపరేటివ్ దుకాణాలద్వారా రైతులకు మంచివిత్తనం, ఉత్తమ వ్యవసాయ పనిముట్లు లభించేట్టు చెయ్యాలి.

(f) ఏ గ్రామానికి వలసిన ఆహారధాన్యాలను ఆ గ్రామంలోనే ఉత్పత్తి ఆయేట్టు చూడాలి. సాధ్యమైనంతవరకు ప్రస్తుతం సాగుతోన్న వ్యాపారపంటలను ప్రోత్సాహించకూడదు.

(g) రైతు రుణాలను జాగ్రత్తగా పర్యవేక్షిస్తూ ఉండాలి. అవసరమైతే అట్టి రుణాలను తగ్గించాలి. వడ్డీరేట్లను కూడా నియమితం చెయ్యాలి. వీలైనచోట్ల అప్పులిచ్చే కోఆపరేటివ్ బ్యాంకులను నెలకొల్పాలి.

(h) భూములు నిస్సారమైపోకుండా ఎరువులు సప్లయి చేస్తూ ఉండాలి. బంజరు భూముల్ని సాగుబడిలోకి తెచ్చేందుకు ప్రయత్నించాలి.

5. పరిశ్రమలు:- (a) గ్రామానికి చాలినంతగా ఖాదీ ఉత్పత్తిని సాధించాలి.

(b) సహకార పద్ధతులపై ఇంకా యితర గ్రామపరిశ్రమలను నెలకొల్పాలి.

(c) పాడిపరిశ్రమను స్థాపించాలి. బర్రెలకన్న ఆవులు శ్రేష్టం.

(d) తోలు పరిశ్రమనుకూడా సాగించాలి.

6. వర్తకవ్యాపారం:- (a) వ్యావసాయిక - పారిశ్రామిక వస్తుసామగ్రిని విక్రయపరచేందుకు సదుపాయాలను కల్పించవలె.

(b) కోఆపరేటివ్ కొనుగోలు సంఘాలను ఏర్పరచాలి.

(c) గ్రామప్రజల ఉపయోగానికి సరిపోగా మిగిలిన వస్తుసామగ్రినే ఎగుమతిచెయ్యాలి. గ్రామంలో ఉత్పత్తికాని అవసర పదార్థాలను మాత్రమే దిగుమతి చేసుకోవాలి.

(d) నిలువ భాండాగారాలను పోషించాలి.

(e) గ్రామంలోని చేతిపనివాళ్లకు స్వల్ప వడ్డీ ఇచ్చే అవకాశాలు కల్పించాలి.

7. ఆరోగ్యశాఖ & వైద్యసహాయం.

(a) మురికినీటి కాలువలను ఏర్పరచి ఆరోగ్యవసతులను కల్పించాలి.

(b) అనారోగ్య * పరిస్థితులను నిర్మూలించి, అంటువ్యాధ్యాలను అరికట్టాలి.

(c) మంచినీటి బావులను, చెరువులను పరిశుభ్రంగా ఉంచాలి.

(d) ప్రతిగ్రామంలోనూ ఒక ఆసుపత్రి, స్త్రీలకు ప్రసవ వైద్యాలయం ఉండాలి. ప్రజలకు వైద్యసహాయం ఉచితంగా లభించాలి. ఆయుర్వేదము, ప్రకృతి చికిత్స మొదలైన స్వదేశీ చికిత్సావిధానాలనే ప్రోత్సహించాలి

8. న్యాయశాఖ : (a) అధికవ్యయమూ, కాలవిలంబనమూ లేకండా గ్రామస్థులకు న్యాయం జరగాలి. సివిల్ - క్రిమినల్ అధికారాలన్నీ పంచాయతీ సభకు విరివిగా ఉంటాయి.

(b) ప్రజలకు ప్లీడరీ సహాయం ఉచితంగా లభించేట్టు చెయ్యాలి.

9. ఫైనాన్సు, పన్నులు :- (a) గ్రామప్రజల సమిష్టి సదుపాయాలను ఏర్పరచే నిమిత్తం పన్నులను విధించి వసూలుచేయవచ్చును. వస్తురూపేణా పన్నులు చెల్లించుపద్ధతిని ప్రోత్సహించవచ్చు గ్రామోపయోగార్థ నిర్మాణములందు అందరూ కలసి కట్టుగా కష్టించి పని చెయ్యటం మంచిది.

(b) పండుగలందూ, ఉత్సవసమయాల్లోనూ ప్రత్యేక విరాళాలను వసూలు చెయ్యాలి.

(c) సరియైన జమాఖర్చుల లెక్క ఉండాలి. ప్రజల పర్యవేక్షణకు అది బద్ధమై వుండాలి.

ఆయావిధులన్నీ ఇక్కడ సమగ్రంగా వివరించాను. ఇందునుబట్టి 'గాంధీ రాజ్యాంగం'లో భారతదేశ గ్రామాలు అనుభవించగల సర్వతంత్ర స్వాతంత్ర్యం ఎలాంటిదో పాఠకులు ఊహించుకోవచ్చును.



# 7

# తాలూకా - జిల్లా పంచాయితీలు

వివిధ గ్రామాలలోని సాంఘిక - రాజకీయార్థిక - ప్రత్యేక కార్యకలాపాలను సమన్వయం చేసేందుకుగాను తాలూకా - జిల్లా పంచాయతీలు ఏర్పడవలె. గ్రామపంచాయతీలను పర్యవేక్షణచేస్తూ, ఉచితమైన సలహాలిస్తూ ముందుకు నడిపించటమే వీటి కర్తవ్యం. అంతేగాని అధికారం చలాయించటంకాదు.

## తాలూకా పంచాయతీ

కొన్నిగ్రామాల పంచాయతీ అధ్యక్షులుకూడి ఒక తాలూకా పంచాయతీ ఏర్పడుతుంది. తాలూకాలోని గ్రామాలసంఖ్యనుబట్టి తాలూకా పంచాయతీ సభ్యులసంఖ్య ఉంటుంది. సాధారణంగా 20,000 జనసంఖ్యగల 20 గ్రామాలను ఒక తాలూకాక్రింద కూర్చవచ్చును. ఇప్పుడుఉన్న తాలూకాల విస్తీర్ణం చాలవరకు తగ్గించవలసి వుంటుంది. అప్పుడుగాని సర్వాంగపరిపాలన కార్యక్రమం సుళువుగా ఫలవంతంగా సాగదు.

తాలూకా పంచాయతీ కాలపరిమితికూడా గ్రామ పంచాయతీకి వలెనే మూడు సంవత్సరాలు.

## తాలూకా పంచాయతీ విధులు

(a) గ్రామ పంచాయతీల కార్యకలాపాలను పరిశీలిస్తూ, తగిన సలహాలిచ్చి సమన్వయం చెయ్యాలి వారి జమాఖర్చు లెక్కలను తనిఖీ చేస్తుండాలి.

(b) సెకండరీ పాఠశాలలను నెలకొల్పాలి.

(c) ప్రత్యేక చికిత్సలకోసం పెద్ద వైద్యశాలలను ప్రసవ - ఆసుపత్రులను నిర్మించాలి.

(d) అత్యవసర సమయాల్లో గ్రామాలకు సాయపడే నిమిత్తం ప్రత్యేకంగా కొంత రిజర్వుపోలీసు దళాన్ని అట్టిపెట్టవలె.

(e) తాలూకా కో-ఆపరేటివ్ బ్యాంకులను, తాలూకా కొనుగోలు సంస్థలను నడపవలె

(f) గ్రామ గ్రామాల్ని కలిపేరోడ్డులను మరమ్మతు చేయిస్తూఉండాలి.

(g) వ్యావసాయికాభ్యుదయ మార్గాలను ప్రబోధించే నమూనా పొలాలను సాగుచేసి ప్రజలకు ప్రదర్శించాలి.

(h) అంతర్గ్రామీణ పోటీపందేలను జరుపుతూ ఉండాలి.

## జిల్లా పంచాయతీ

తాలూకా పంచాయతీల అధ్యక్షులంతా కలసి జిల్లా పంచాయతీగా ఏర్పడతారు. సాధారణంగా జిల్లాకు డజన్ తాలూకాలు ఉండవచ్చును. జిల్లా పంచాయతీ కాలపరిమితికూడా మూడు సంవత్సరాలే. దాని విధులు:

(a) తాలూకా పంచాయతీలకు సలహాలివ్వటం, వారిలెక్కలను తనిఖీ చేస్తూండటం.

(b) ఉన్నత విద్యా (College education) సౌకర్యాలను కలిగించటం.

(c) ప్రత్యేకవ్యాధులకోసం పెద్ద వైద్యాలయాలను పోషించటం.

(d) జిల్లా రిజర్వు రక్షణదళాన్ని ఉంచటం.

(e) జిల్లా కోఆపరేటివ్ బ్యాంకులను, కొనుగోలు సంఘాలను స్థాపించటం.

(f) నీటి పారుదల వసతులు కల్పించటం.

(g) అన్నితాలూకాల వారికీ పోటీ పందెములను అప్పుడప్పుడు ఏర్పరచటం.

చిన్న చిన్న రాష్ట్రాలలో జిల్లా పంచాయతీలు ఏర్పడకపోయినా పరవాలేదు. తాలూకా పంచాయతీలకు రాష్ట్రీయ ప్రభుత్వంతో సన్నిహిత బాంధవ్యం ఉంటుంది.

## పురపాలక సంఘాలు

పట్నాలలో 'వార్డు పంచాయతీ'లు పురపాలకసంఘాలు ఉంటాయి. పురపాలక సంఘానికి శాసనాలు చేయటం, అమలు జరచటం అన్ని అధికారాలూ ఉంటాయి. దాని విధులు కొంచెము యించుమించు జిల్లా పంచాయతీ విధుల ననుసరించే ఉంటాయి. వార్డు పంచాయతీల కార్యకలాపాలను పురపాలకసంఘం సమన్వయిస్తుంది.

రవాణా-విద్యుచ్ఛక్తి-నీటివసతి-యేర్పాట్లన్నీ మునిసిపాలిటీ (పురపాలక సంఘము) మేనేజిమెంటుకిందనే ఉండవలె.



# 8

# రాష్ట్ర ప్రభుత్వం

జిల్లా పంచాయతీలు, పురపాలక సంఘాలు తమతమ అధ్యక్షులను రాష్ట్ర పంచాయతీకి పంపుకుంటాయి. సభ్యుల సంఖ్య ఆ రాష్ట్రాన్ని బట్టి వుంటుంది. చిన్న చిన్న రాష్ట్రాల్లో జిల్లా పంచాయతీ అధ్యక్షుని, పురపాలక సంఘాధ్యక్షునిగాక మరొక ప్రతినిధినికూడ రాష్ట్ర పంచాయతీకి పంపుకో వచ్చును.

రాష్ట్ర పంచాయతీ కాలపరిమితి మూడు సంవత్సరాలు. సాలుకు రెండు పర్యాయాలు సమావేశమౌతుంది.

విధులు

(a) జిల్లా పంచాయతీల కార్యకలాపాలను పర్యవేక్షించటం, వాటి జమ—ఖర్చు లెక్కలను తనిఖీచెయ్యటం.

(b) ప్రత్యేక రిజర్వు పోలీసు శాఖను పోషించటం.

(c) విశ్వ విద్యాలయాలను నిర్మించటం, సాంకేతిక (Technical) శిక్షాశాలలను, పరిశోధనాలయాలను స్థాపించటం

(d) రవాణా – రాకపోకల – సౌకర్యాలను ఏర్పరచటం. రవాణాశాఖ రాష్ట్ర పంచాయతీ ఆధిపత్యంలోనూ, మేనేజిమెంటులోనూ ఉంటుంది.

(e) నీటి పారుదల వసతులను కల్పించటం.

(f) అవసరపడినప్పుడు క్షామనివారణ సదుపాయాలు చెయ్యటం.

(g) జిల్లా పంచాయతీలకు స్వల్పవడ్డీమీద అప్పులివ్వగల ఒక రాష్ట్రీయ కోఆపరేటివ్ బ్యాంకును స్థాపించటం.

(b) రాష్ట్రంలోని స్వాభావిక వస్తుసంపదను (Natural resources) వృద్ధి చేసుకోవటం; కీలక పరిశ్రమలను తన యాజమాన్యలో నడపటం.

సరిహద్దులు.

రాష్ట్రాల సరిహద్దులను భాషాప్రయుక్తంగా నిర్ణయిస్తారు. ప్రస్తుతపు రాష్ట్రాల సరిహద్దులు చరిత్రాత్మకంగా ఏర్పడినవేగాని, వైజ్ఞానికంగా సమర్థనీయములు కావు. కొన్ని రాష్ట్రాల్లో భిన్నభిన్న సాహిత్యాలు సరిపడని కాపురం చేస్తున్నవి. కాబట్టి ముమ్ముందు భాషా ప్రయుక్త రాష్ట్ర విభజన అవశ్యం జరుగవలసిందే. ఎందుచేతనంటే — శాసనసభలలోనూ, న్యాయస్థానాలలోనూ విద్యాశాఖయందూ రాష్ట్రీయ భాషల ద్వారానే అన్ని వ్యవహారాలూ జరుగుతాయి. అటువంటప్పుడు ఒకేరాష్ట్రంలో రెండుభాషలవారు ఉంటే కొన్ని ఇబ్బందులు సంభవిస్తాయి. అదిగాక పిల్లల విద్యాభ్యాసము ఆదినించి చివర వరకూ వారి మాతృభాషలోనే జరగాలి రెండుమూడు భాషలవారున్న రాష్ట్రాలలో మాతృభాషలో బోధన పద్ధతి సాగనేరదు. ఈదృష్ట్యా బొంబాయి మద్రాసు, మధ్యపరగణాలలో చాల ప్రాదేశిక సంస్కరణలను ప్రవేశ పెట్టవలసి వుంది.

## భవిష్యత్ రాజ్యాంగంలోని రాష్ట్రాల పేర్లు

| రాష్ట్రము | భాష |
|---|---|
| 1 అజ్మీరు - మార్వారా | హిందూస్థానీ |
| 2 ఆంధ్ర | తెలుగు |
| 3 అస్సాం | అస్సామీస్ |
| 4 బీహారు | హిందూస్థానీ |
| 5 బెంగాలు | బెంగాలీ |
| 6 బొంబాయి | మరాటీ - గుజరాతీ |
| 7 ఢిల్లీ | హిందూస్థానీ |
| 8 గుజరాతీ | గుజరాతీ |
| 9 కర్నాటక | కన్నడ |
| 10 కేరళ | మళయాళ |
| 11 మహాకోసల | హిందూస్థానీ |
| 12 మహారాష్ట్ర | మరాటీ |

| | |
|---|---|
| 13 నాగపూరు (బీరార్‌తో సహా) | మరాఠీ |
| 14 వాయవ్యసరిహద్దు రాష్ట్రం | పుస్తు |
| 15 పంజాబ్ | పంజాబీ |
| 16 సింధు | సింధీ |
| 17 తమిళనాడు | తమిళ్ |
| 18 సంయుక్తపరగణాలు | హిందూస్తానీ |
| 19 ఉత్కళ | ఓఢ్ర |

ప్రస్తుతం కాంగ్రెసులో వ్యవహృతము లౌతూన్న రాష్ట్రాలే ఇవి అయితే కొన్ని కారణాలవల్ల నాగపూర్ విదర్భలను కలుపవలసి వచ్చినది ఈ రాష్ట్రాలకు కాంగ్రెసు నిర్ణయించిన సరిహద్దులు ముమ్ముందు మార్చుకోవలసిన పరిస్థితు లేర్పడవచ్చును. ఏమైనా కొన్ని సంస్థానాలు భారత సమాఖ్యలో చేరటానికి ఇచ్ఛగించేట్టయితే ఆసంస్థానాలతో సంప్రదించి భాషాప్రయుక్తంగా సరిహద్దులను పునః నిర్ణయించవలసి ఉంటుంది. ప్రస్తుత సంయుక్త పరగణాలను తూర్పు - పడమర భాగములని రెండు రాష్ట్రములుగా భాగించవచ్చును. ఈరకమైన కార్యకలాపమంతా రాజ్యాంగ నిర్మాయక సభవారు ఏర్పరచే ఒక ప్రత్యేక కమిటీకి ఒప్పచెబుతారు. అవసరమైన ప్రదేశాల్లో ప్రజాభిప్రాయాన్ని 'ప్లెబిసైట్' ద్వారా నిర్ణయిస్తారు.

## పరిపాలన

రాష్ట్ర పంచాయతీ అంటే రాష్ట్ర శాసనలసభల అన్నమాట దాని విధులు పైని ఉదహరించాము. ఆవిధులు నిర్వర్తించు సందర్భంలో వలసిన చట్టాలను జారీచేయు సర్వాధికారాలు ఈసభకు ఉంటాయి.

రాష్ట్రపంచాయతీ సభ్యులు తమ అధ్యక్షుని ఎన్నుకొంటారు. అతడు రాష్ట్రపతి.

రాష్ట్ర పంచాయతీ - రాతకోతలు - మొదలైన వ్యవహారాలన్నీ ఆ రాష్ట్రీయ భాషలోనే జరిగించాలి.

శాసననిర్మాణ - కార్యనిర్వాహక శాఖలు రెండింటికీ ప్రత్యేక విధులుంటాయి. రాష్ట్ర పంచాయతీవారు వివిధ శాఖలకు మంత్రులను నియమిస్తారు. ఈమంత్రులు పంచాయతీకి బాధ్యులైవుంటారు. కాని పంచాయతీ సభ్యులలోనించే ఈమంత్రులను ఎన్నుకోరు. "ప్రధాన కార్య

నిర్వాహకసభ. ప్రధాన శాసనసభ ఇంచుమించు ఒకటిగానే వ్యవహరించే దేశాల్లో - కార్యనిర్వాహక సభ్యులకు కావలసినంత జీతాలిచ్చే ఇంగ్లాండు వంటి దేశాల్లోనూ - ప్రభుత్వ సభ్యులు అంతగా బాధ్యత పట్టించుకోరు; పార్టీ ప్రాబల్యాలు విజృంభిస్తాయి; ప్రభుత్వ విధానం నిష్పాక్షికంగా సాగదు." పంచాయతీసభ్యులు జీతభత్యాలు లేకండా 'ఆనరరీ' గానే పని చెయ్యాలి.

మంత్రుల కాలపరిమితి మూడు సంవత్సరాలు. అసమర్థులు, అప్రా చ్యులు అయితే సేతప్ప వారిని తొలగించటానికి వీల్లేదు.

పార్టీ పక్షపాతమునుబట్టిగాని, మతాభిమానాన్ని బట్టిగాని మంత్రు లను నియమించరాదు. వారు ఆరాష్ట్రంలో ఉత్తమ విజ్ఞానధనులై ఉండాలి. మంత్రులసంఖ్య రాష్ట్ర విస్తీర్ణాన్ని బట్టి నిర్ణీతమౌతుంది. అయిదుగురికి తగ్గ కూడదు; తొమ్మండుగురికి మించకూడదు.



# 9

# కేంద్ర ప్రభుత్వం

రాష్ట్ర పంచాయతీల అధ్యక్షులంతా కలిసి కేంద్రపంచాయతీ ఏర్పడుతుంది. పెద్దరాష్ట్రాలు 'రాష్ట్రపతి'నే గాక మరొక రాష్ట్ర పంచాయతీ సభ్యునిగూడ కేంద్ర పంచాయతీకి పంపుకొనవచ్చును.

కేంద్రపంచాయతీ (అఖిలభారత పంచాయతీ) అంటే కేంద్రశాసన సభ అన్నమాట. ఇది ఒక్కటే సభచాలు. రెండుశాసనసభలు నిర్మించటం అనవసరమైనఖర్చు. రౌండు టేబిల్ సమావేశానికి వెళ్లినప్పుడు గాంధిజీ ఒక ఉపన్యాసంలో ఇలా చెప్పాడు:

రెండుశాసనసభ లుండాలన్న మోజు నాకు లేదు. ఒక శాసనసభే అయినందువల్ల తొందరపాటుకులోనై...తరువాత పస్తాయించవలసిన చట్టాలను అమలుచేసేస్తుందేమో నన్నభయం నాకులేదు. అది తన బాధ్యతలను గుర్తించగలదని నావిశ్వాసం. పైగా మాది మిక్కిలి బీదదేశం. ఖర్చుఎంత తగ్గితే అంత మంచిది."

సంస్థానాలుకూడా అఖిలభారత సమాఖ్యలో చేరేట్టయితే సంస్థాన ప్రతినిధులుకూడా కేంద్రపంచాయతీలో ఉంటారు. కాని వారు జమీందారులు నియమించినవారుగా ఉండరు; సంస్థానాలలోని ప్రజాశాసనసభల అధ్యక్షులైవుంటారు. కేంద్రపంచాయతీ కాలపరిమితి మూడేళ్లు.

## విధులు

స్థానికంగానూ, రాష్ట్రాల్లోనూ సర్వతంత్ర స్వాతంత్ర్యం ఉన్నందువల్ల కేంద్రపంచాయతీవిధులు కొలదిగానే ఉంటాయి. అవి:

*(a)* పరదేశదాడులనించి స్వదేశరక్షణం.

*(b)* అవసర పడినప్పుడు దేశంలో శాంతి నెలకొల్పేందుకుగాను ఒక జాతీయ రక్షణ దళాన్ని పోషించటం.

(c) ఆర్థిక నిర్మాణానికి సంబంధించిన రాష్ట్రాలవారి ప్రణాళికలను సమన్వయం చేయటం.

(d) అఖిలభారత ప్రజోపయోగార్థములైన కీలక పరిశ్రమలను నడపటం

(e) అఖిల భారతానికి సంబంధించిన రవాణా – రాకపోకల శాఖలకు యాజమాన్యం వహించటం

(f) కరెన్సీ – కస్టమ్సు అంతర్జాతీయ వర్తక – శాఖలను పర్యవేక్షించటం

(g) అఖిలభారత ప్రాముఖ్యంగల సాంకేతిక – శాస్త్రపరిశోధక – కళాశాలలను స్థాపించటం; రాష్ట్రాలకు విద్యాభివృద్ధి విషయంలో సలహాలివ్వటం.

(h) మన విదేశాంగ నీతిని నిర్ణయించటం ఇతర చిన్న చిన్న విధులన్నీ స్థానిక స్వపరిపాలనా సంస్థలే నిర్వహిస్తాయి. అవన్నీ కేంద్ర ప్రభుత్వం పట్టించుకోనవసరం లేదు.

## పరిపాలన

కేంద్ర పంచాయితీ సభయే ప్రధాన కేంద్ర శాసన సభ యన్నమాట తన విధినిర్వహణకు వలసిన చట్టాలను జారీచేస్తుంది. కేంద్ర పంచాయితీ అధ్యక్షుడు దేశానికంతకూ 'అధిపతి' అన్నమాట.

వివిధ శాఖలకు మంత్రులు నియమితు లౌతారు, కేంద్ర పంచాయితీ సభ్యులే మంత్రులుగా ఉండరాదు. ఈ విధంగా, శాసన కార్య నిర్వాహక శాఖలను పృథక్కరించవచ్చును.

ఈ మంత్రుల సభ కేంద్ర పంచాయితీకి బాధ్యత వహిస్తుంది మంత్రుల కాలపరిమితి మూడేళ్లు. అసమర్థులు, అప్రాచ్యులు అయితేనే తప్ప వారిని తొలగించేందుకు వీల్లేదు. క్షంతవ్యము కానిమహాపరాధ మేదైనా చేసివుంటె మాత్రం ఆ మంత్రిని తక్షణమే బర్తరఫ్ చేయవచ్చును...అతని కాలపరిమితి ముగియక పోయినాసరే.

ఈ మంత్రులు దేశంలోని ఉత్తమ విజ్ఞానఘనులై ఉండాలి. పార్టీ పక్షపాతంలోనూ, మతాభిమానాన్ని పురస్కరించుకొనీ మంత్రులను ఎన్నుకోకూడదు. స్థానికంగా స్వపరిపాలనాసంస్థలు విరివిగా ఉంటాయి కాబట్టి రాజకీయపార్టీలు ఎక్కువగా జన్మించవు. ఈమంత్రి వర్గంలో అన్నిమతాల వారికీ ముఖ్యంగా అల్పసంఖ్యాకులకు, న్యాయబద్ధమైనప్రాతినిధ్యముండి తీరుతుంది.

కాబట్టి స్వతంత్ర భావిభారత రాజ్యాంగంలో దామాషాపద్ధతిని మతప్రాతినిధ్యానికి తావులేదు. క్రమేణా భారతదేశం సంపూర్ణ అహింసా పద్ధతులకు లోబడి ఉంటుంది; ఏ అల్పసంఖ్యాకవర్గమూ న్యూనతకుగాని, 'మేము వేరు' అన్న వ్యతిరేకభావానికి గాని లోనుగావు.

## సమాఖ్యలోని ప్రాంతాలు

అఖిల భారత సమాఖ్యలో అన్ని రాష్ట్రాలూ, స్వదేశ సంస్థానాలూ చేరవచ్చును. నిర్బంధము మాత్రం లేదు. సమాఖ్యంలో చేరే అన్ని ప్రాంతాలకు సర్వతంత్ర స్వాతంత్ర్యం ఉంటుంది. భారతదేశము గోళికంగానూ, సాంస్కృతికంగానూ ఏకఖండము కాబట్టి అన్ని రాష్ట్రాలూ, స్వదేశ సంస్థానాల్లో సంతోషపూర్వకంగా అఖిలభారత సమాఖ్యలో చేరిపోగలవనే ఆశిస్తున్నాము. అది జాతి పురోభివృద్ధికి అవసరం. జాతి సమిష్టి జీవితము సమరసంగా, సమంజసంగా, ఐకమత్యంతో సాగిపోయేలాగున మనం సర్వప్రయత్నాలు చెయ్యాలి కాని ఏ ప్రాంతాన్నీ కూడా అక్కడి ప్రజానీకుల యిష్టం తెలుసుకోకుండా సమాఖ్యలో చేరవలసిందని బలవంతం చెయ్యకూడదు. చేరితే బుద్ధిపూర్వకంగా చేరవలసిందే. రష్యాలో సోవియట్ సమాఖ్యనుంచి విడిపోయే హక్కు పదకొండు 'యూనియన్ రిపబ్లిక్'లకు మాత్రమే ఉంది. మిగిలిన అసంఖ్యాక 'అటానమస్ రిపబ్లిక్'లకు ఆ హక్కు లేదు. ఆ పదకొండు యూనియన్ రిపబ్లికులకు ఉన్న హక్కు కూడా నామమాత్రమైనదే. ఎందుచేతనంటే సోవియట్ సమాఖ్యనుంచి విడిపోయేందుకు కావింపబడే ప్రయత్నాలన్నీ దేశద్రోహ నేరముల క్రింద పరిగణింపబడుతూన్న సంగతి అందరూ ఎరిగినదే.

అహింసావిధానాన్ని అవలంబించే రాజ్యాంగంలో నిర్బంధానికి తావులేదు. పశుబలం ఉపయోగించేది లేదు. వివిధ ప్రాంతాలవారు వారి వారి యిష్టాయిష్టాలనుబట్టి అఖిలభారత సమాఖ్యలో చేరవచ్చును; చేరకపోవచ్చును. సమాఖ్యనించి విడిపోయే హక్కును కాదనలేము. కాని గాంధీ — రాజ్యాంగంలో పరస్పర సహకార సుహృద్భావ–సానుభూతి–సహనాలు పెంపొందగలవు గనుక 'మేము విడిపోతాం' అని ఏ ప్రాంతమూ పెదవివిప్పి అడగజాలదు.

## భాష

కేంద్ర పంచాయతీ కార్యకలాపమంతా హిందూస్థానీ భాషలో నాగరీ ఉర్దూ లిపులలో సాగుతుంది.

# 10

# న్యాయ పరిపాలన శాఖ

బ్రిటిష్ ప్రభుత్వం తెచ్చిపెట్టిన న్యాయపరిపాలనా విధానం భారతీయుల ఆర్థిక - సాంఘిక జీవనక్షేత్రాల్లో అనేక అనర్థాలకు కారణభూతమైనది. పంచాయతీలు సివిల్ క్రిమినల్ కేసులను అప్పటికప్పుడు విచారణ చేసి తక్షణమే తీర్పు చెప్పేవి. దొంగ సాక్ష్యాలను, ఫోర్జరీలను ఘోర పాపాలుగా పరిగణించేవారు. ఎక్కువ డబ్బు ఖర్చులేకుండా న్యాయం జరిగేది మరి ఇప్పటి న్యాయాలయాలో? డబ్బుతో ఉంది. అక్కడి వ్యవహారమంతా చిన్న చిన్న కేసుల విచారణకూడా నెలల తరబడి జరుగుతూంటుంది. ఒక్కొక్కప్పుడు సంవత్సరాలుకూడా గడిచిపోతాయి. ఈలోగా అనేక అక్రమచర్యలు, అబద్ధాలు చెల్లిపోతూఉంటాయి. వందల కొద్దీ లాయర్లూ, వారి ఏజంట్లూ కలసి గ్రామస్థులను అన్యాయముగా కోర్టుల కెక్కించి, కోట్లకొలది ధనం దోచేస్తున్నారు. ఫోర్జరీలు, కూట సాక్ష్యాలు చలామణి ఔతున్నవి; సత్యం ఓడిపోతున్నది. బ్రిటిష్ న్యాయాలయాలు ప్రజలను నీతిమంతులను చెయ్యటానికి బదులు ప్రధానంగా అవినీతిపరులనుగా తయారుచేస్తున్నవి. ఈ న్యాయాలయాల పీడ ఎంత తొందరగా వొదిలిపోతే అంతమంచిది మనకు

"ప్రభుత్వంవారు పరిపాలనాధికారాన్ని కేంద్రీకరించటం పొరపాటని నా అభిప్రాయం. ప్రతిగ్రామమూ సర్వస్వతంత్రం అనుభవిస్తూ ఉంటే ప్రాచీన భారతరాజ్యాంగం అంతరించినప్పుడే ఈదేశానికి శనిపట్టుకుంది ప్రభుత్వం పాశ్చాత్య పద్ధతులమీద కోర్టులను స్థాపించింది. ఈకార్యకలాపమంతా గ్రామస్థులే ఎంతో సమర్థతతో, చాకచక్యంతో నిర్వహించు కోగలరు. ప్రతిగ్రామంలోనూ చిన్నచిన్న సివిల్ క్రిమినల్ తగాయిదాలను

స్వయంగా పరిష్కరించగల పంచాయతీని స్థాపించవలెను! నా కోరిక" — అన్నాడు ఎంత బ్రిటిష్ గవర్నరైనా సర్ మారిస్ హాలెట్.

## గ్రామ పంచాయతీ

న్యాయపరిపాలన శాఖకూడా గ్రామపంచాయతీసభదే. అందువల్లనే ఇంకో పంచాయతీసభ అనవసరం. బీదరైతులు పట్నాలకుపోయి, కోర్టుల చుట్టూ వారాల తరబడి తిరుగుతూ కష్టార్జితమైన డబ్బును తగలబెట్టుకో నక్కర్లేదు; స్వగ్రామంలోనే... ప్లీడర్ల ముఖాన ధనంపొయ్యకుండా... న్యాయం పొందగలరు. కేసుకొంచెం క్లిష్టతరమైనప్పుడు తాలూకాయొక్క గాని, జిల్లాయొక్క గాని సబ్ జడ్జిని పిలిపించుకుని పంచాయతీసభ సలహాలను పొందవచ్చును. సబ్ జడ్జి గ్రామస్థులకు మిత్రుడుగా, మార్గదర్శకుడుగా ఉంటూ, న్యాయశాస్త్ర సూత్రములను వారికెరుకపరుస్తూ ఉండాలి. అలాంటి న్యాయపరిపాలనశాఖ ఎంతో ఉత్తమమైనదనిపించుకుంటుంది. అధిక ధనవ్యయం ఉండదు. కాలయాపనలేకుండా పార్టీలకు న్యాయం జరుగుతుంది. గ్రామంలో ప్రతివిషయమూ సాధారణంగా అందరికీ ప్రత్యక్షంగా తెలిసేవుంటుంది. రహస్యాలుండవు. నిజం బట్టబయలుగా కనిపిస్తూ ఉంటుంది. తిమ్మిని బ్రహ్మను, బ్రహ్మను తిమ్మినిచేసే ప్లీడర్ల గారడీ విద్యలతో పనివుండదు. మోసాలు సాగవు. న్యాయము జరిగితీరుతుంది.

## జిల్లా కోర్టులు

సివిల్ - క్రిమినల్ వివాదాలను విచారించే అధికారాలు చాలవరకు గ్రామపంచాయతీలకు ఉంటాయి. కాబట్టి ప్రత్యేక తాలూకా కోర్టులను స్థాపించవలసిన అవసరంలేదు. గ్రామాలనించి అవసరమైతే సరాసరి జిల్లా కోర్టులకే అప్పీలు చేసుకోవచ్చును. పట్నాల్లోని వివాదాలనుకూడా జిల్లా కోర్టే విచారించాలి. జిల్లాజడ్జీలకు జిల్లా ఎగ్జిక్యూటివ్ అధికార్లతో సంబంధం ఉండదు. వారిని జిల్లా పంచాయతీ నియమిస్తుంది. ఉద్యోగకాలపరిమితి ముగిసేవరకూ, మంచినడవడిక ఉన్నన్నినాళ్లూ వారిని ఎవరూ తొలగించటానికి వీల్లేదు.

## హైకోర్టులు

కొన్ని అసాధారణపరిస్థితులలో మాత్రమే జిల్లా కోర్టులనించి హైకోర్టులకు అప్పీలు చేసుకోవచ్చును. హైకోర్టు జడ్జీలనురాష్ట్ర పంచాయతీ నియమి

స్తుంది. వారికి ఎగ్జిక్యూటివ్ శాఖతో సంబంధం ఉండదు. నడవడి చెడకుండా ఉంటే యావజ్జీవం వారికా ఉద్యోగార్హత ఉంటుంది.

## సుప్రీమ్ కోర్టు

సుప్రీంకోర్టు తీర్పుకు మరి తిరుగు ఉండదు. అదే ప్రధాన న్యాయ స్థానము. దాని విధులు:

(a) హైకోర్టులనించివచ్చే అప్పీళ్లను విచారించటం.

(b) అఖిలభారత సమాఖ్యలోని వివిధ ప్రాంతాలమధ్య పొటమరించే రాజ్యాంగ సంబంధమైన వివాదాలను పరిష్కరించటం.

(c) పైసారటీల ప్రధాన హక్కులను సంరక్షించటం.

సుప్రీంకోర్టు జడ్జీలను కేంద్రపంచాయతీ సభ నియమిస్తుంది. వీరు ప్రత్యేక పార్టీ పక్షపాతులుగాని, ప్రత్యేక మతాభిమానాలుగానిలేని ఉత్తమ విజ్ఞాన నిధులు, శీలవంతులుఅయివుండాలి సౌశీల్యము చెడనంతవరకూ వారికి యావజ్జీవ ఉద్యోగార్హత ఉంటుంది.

## న్యాయ చట్టము సవరణ

ప్రస్తుతం అమలులో ఉన్న సివిల్ క్రిమినల్ న్యాయచట్టాలు విజాతీయములు, డొంక తిరుగుడుగా ఉన్నాయి. మనక్రొత్త రాజ్యాంగంరాగానే ఆచట్టాలను తిరగ తోడవలసినదే. అందుకోసంగాను భారత రాజ్యాంగ నిర్ణయ సభవారు సమర్థులతో కూడిన ఒక కమిటీని నిర్ణయించవలెను.



# 11

# ఎన్నికల విధానం

గ్రామాల్లో ఎన్నికలు ప్రత్యక్షంగా జరుగుతాయి తాలూకా - జిల్లా రాష్ట్ర కేంద్ర - ఎన్నికలుమాత్రం పరోక్షంగానే జరుగుతాయి. ఈ సంగతి లోగడ ప్రకరణాలలో విశదం చేశాను. కనుక ఈ రాజ్యాంగంలో ప్రత్యక్ష ద్వివిధ యెన్నికల విధానముల ముఖ్యలాభములను పొందగలుగుతున్నాము. గ్రామంలో స్థానిక పాలనము సాధ్యమైనంతవరకు సర్వతంత్ర సమన్వితముగా ఉండాలి, కనుక అక్కడి ఎన్నికలు ప్రత్యక్షముగా జరుగవల సదే కాని పై పంచాయతీలవారి విధులు చాల వరకు క్రింది సంస్థలకు సలహాలివ్వటం, వారి కార్యకలాపాలను పర్యవేక్షిస్తూ ఉండటం. కాబట్టి వాటి యెన్నికలు పరోక్షంగా ఉండటమే సమంజసం. అందువల్లవ్యయప్రయాసలు ఉండవు ఇండియా వంటి విశాలదేశంలో ప్రత్యక్ష ఎన్నికలు జరుగవలెనంటే ఎంతో కాలం, ధనం వృధాకావలసిందేకదా! అంతేగాక మన నూతన రాజ్యాంగపు ఎన్నికల విధానంలో అనేక రాజకీయ పార్టీలుగాని, మత వైషమ్యాలుగాని తలచూపే అవకాశంలేదు. పరోక్ష ఎన్నికల విధానం ఏ కొలదిమంది బాధ్యతగల వ్యక్తుల ద్వారానో జరిగిపోతుంది అందుచేత లంచగొండి తనాలు, తదితర నీచప్రవర్తనలు ఉండవు. అంతేగాక పైపంచాయితీ సభ్యులు క్రింది పంచాయతీల అధ్యక్షులై వుంటారు. కాబట్టి వారు తమనియోజకవర్గాన్ని మరచిపోదామన్నా మరచి పోవటానికి వీల్లేదు కేంద్ర పంచాయితీ అధ్యక్షుడు కూడా తన గ్రామపంచాయతీ అధ్యక్షుడై వుంటాడు కూడా. అందుచేత అతనికి సామాన్య ప్రజల కష్టసుఖాలెలా వున్నాయో, వాళ్లకు కావలసిన సౌకర్యాలెట్టివో అతనికి బాగా తెలుస్తుంది. శాసన సభలో బావగారు చెయి ఎత్తితే తానూ ఎత్తవచ్చులే అని తాపీగా కుర్చీ అలంకరించే రాజకీయజ్ఞుడు కాదు. ఏ సభ్యుడైనా ప్రజలయెడ తన విధులను నిర్వర్తించకపోతే మరుసటి యెన్ని

కలలో మళ్ళీ అతనికి "ఛాన్సు" ఉండదు. తన గ్రామపంచాయతీయే అతన్ని పీఠం దిగమంటుంది. దానితో అతనికి పైపంచాయతీల సభ్యత్వం కూడా దానంతట అదే ఊడిపోతుంది గ్రామనియోజకవర్గాలు చిన్నవి కాబట్టి అభ్యర్థుల గుణగణాలను, అర్హతలను ప్రజలు సంపూర్తిగా ఎరిగి వుంటారు. మామూలుగా ఎన్నికల ప్రచారాల్లో ఇప్పుడు సాగుతూన్న మోసాలు, కుట్రలు సాగటానికి ఆస్కారం ఉండదు.

## వోటు అర్హత

"వోటర్ల అర్హత లెట్టివి?" - అన్న ప్రశ్న గ్రామ పంచాయతీ యెన్నికల సందర్భంలోనే వస్తుంది. గ్రామాల్లో జాతి - మత - కుల విచక్షణ లేకుండా వయోజనులందరికీ... స్త్రీలకుకూడా... వోటుహక్కు ఉండవల సిందే. సాంఘిక - ఆర్థిక పరిస్థితులనుబట్టి వోటు హక్కును నిర్ణయించ కూడదు. చదువనూ, రాయనూ చాతగాకపోయినా వోటుహక్కు ప్రతి వానికీ ఉండవలసినదే.

"డబ్బు ఉన్నంతమాత్రాన ఓటుహక్కు ఉండటం; ఆడబ్బు, చదువు లేనంతమాత్రాన ఎంతో బుద్ధిమంతునికికూడా వోటుహక్కు లేకపోవటం - ఇదినేను సహించలేను ఒకరి జోలికిపోకుండా, కాయకష్టం చేసుకుని, చెమటోడ్చి, నీతిగా బ్రతుకుతూన్న కార్మికునికి... బీదవాడైనంతమాత్రాన ఓటుహక్కు లేకపోవటం అన్యాయం. ప్రతివోటరూ కనీసం చదవనూ వ్రాయనూ నేర్చివుండాలన్న సూత్రంమీద నాకు మోజులేదు. నాదేశ ప్రజలంతా చదువనూ, రాయనూ నేర్చియుండవలెననే నాకోరిక. కాని అది సిద్ధించేవరకూ వారికి వోటుహక్కు లేకపోవటం నేను ఒప్పుకోను.. అంతవరదాకా నేను వేచివుండలేను" - అన్నాడు గాంధిజీ.

## ప్రత్యేక అర్హతలు

పంచాయతీ సభ్యులను కార్యనిర్వాహక సభ్యులను ఎన్నుకునే టప్పుడు వోటర్లు ఈక్రింది ప్రత్యేకార్హతలను పాటించవలసి వుంటుంది.

(a) విద్యావంతుడై ఉండాలి.

(b) అనుభవజ్ఞుడై ఉండాలి.

(c) ద్రవ్యవంతుడై వుండాలి. (లంచగొండి తనానికి దిగకుండా ఉండేందుకు)

(d) స్వార్థరహిత - ప్రజాసేవ కొంత చేసినవాడై ఉండాలి;

ఎన్నికలలో అభ్యర్థులు ప్రచారం చేసుకోనడం తప్పు. పంచాయతీ సభ్యత్వం అమిత బాధ్యతాయుతమని గుర్తించాలి. స్వార్థలాభ ప్రాప్తికీ, కేవల గౌరవసముపార్జనకూ దాన్ని వినియోగించుకోరాదు.

## సంయుక్త నియోజక వర్గాలు

ఈరాజ్యాంగంలో గ్యారంటీ చేయుబడిన ప్రాథమిక హక్కులు అత్యంత విశాలోదారములు. కనుక ప్రత్యేక నియోజకవర్గాలు, మత ప్రయుక్త నియోజకవర్గాలు అంతరించపోవలసినదే నిజానికి బ్రిటిష్‌వారి నీతిజ్ఞులు మన దేశంలో ప్రవేశ పెట్టిన ప్రత్యేక నియోజకవర్గాలే ఈతీవ్రమత వైమనస్య - వైషమ్యాలకు ముఖ్యకారణాలు. 'అల్పసంఖ్యాకసమస్య' అన్న ప్రకరణంలో ఈ విషయాన్ని సమగ్రంగా విపులీకరించాను ప్రస్తుతానికి... మన భావిభారత రాజ్యాంగంలో సంయుక్త నియోజక వర్గాలద్వారానే ప్రతినిధులను ఎన్నుకోవలెనని సూచిస్తున్నాను.

## లాటరీ పద్ధతి

ప్రాచీన భారతదేశంలో ఒక విచిత్రమైన ఎన్నికలవిధానం అమల్లో ఉండినట్టు రెండు ఉత్తరమల్లూరు శాసనాలనుబట్టి తెలుస్తున్నది.

"పన్నెండు వీధులుగల గ్రామము ఎన్నికలప్పుడు ముప్ఫయివార్డులు (ఎలెక్షన్ ఆఫీస్లు) గా విభాగితమౌతుంది ప్రతివార్డులోనూ మీటింగు జరుగుతుంది. ఆవార్డు ప్రజలంతా హాజరుకావాలి. ప్రతివాడూ తాను వోటు ఇవ్వదలచుకున్న అభ్యర్థి పేరును...అతని అర్హతలను పూర్తిగా విమర్శించుకున్న పిమ్మట... ఒక చీటీమీద వ్రాయాలి ఆచీట్లన్నీ ఒక పొట్లం కడతారు. ముప్ఫయి వార్డులనించీ ముప్ఫయి పొట్లాలు వస్తాయి. ప్రతి పొట్లంమీద ఆవార్డుపేరు ఉంటుంది. ఈ పొట్లాలన్నీ ఒక కుండలో ఉంచుతారు ఒకరోజున గ్రామప్రజాపరిషత్తు...చిన్నలు, పెద్దలు, దేవాలయపూజారులు, యావన్మందీ...సమావేశమౌతారు. ఆకుండను సభమధ్యలో తెచ్చిఉంచుతారు. ఒక వృద్ధ పూజారి ముందుకువచ్చి... అందరికీ

కనిపించేట్టు ఆకుండను ఎత్తి పట్టుకుంటాడు. ఒక చిన్న కుర్రవాణ్ణిపిలిచి అందులోనించి ఒకపొట్లం తియ్యమంటారు. ఆతీసిన పొట్లంవిప్పి అందులోని చీటీలన్నీ మరొకపాత్రలోవేసి కలిపేస్తారు. ఆకుర్రవాడు మళ్లీ అందులోనించి ఒకచీటీ తీస్తాడు. దాన్ని "మధ్యవర్తి" తన అరచేతిలోఉంచుకుని, దానిపైఉన్న పేరును చదువుతాడు' ఆచీటీ పూజారులందరూ అందుకుని ఆపేరును పైకి చదువుతారు. ఆపేరుగల పెద్దమనిషి ఎన్నుకోబడినాడన్నమాట. ఇలాగే 30 వార్డుల అభ్యర్థులనూ ఎన్నుకోవటం జరుగుతుంది.

ఈ యెన్నికల పద్ధతి నిజమైన ప్రజాస్వామిక విధానము ననుసరించినది కాదు. అయినా అది ఆనాటి ప్రజలసాంఘిక జీవితములో మంచితనమును, పవిత్రతను పోషించింది. ఈనాటి 'ఎలెక్షన్లలో' కనిపిస్తూన్న ఈర్ష్యాద్వేషాలు అప్పుడు లేనేలేవు. కొన్ని మార్పులతో ఆనాటి విధానమును మన మనుసరించవచ్చును. ప్రత్యక్ష ఎన్నికలవల్లగాని, 'బాలెట్' పద్ధతినిగాని, కొన్నిపేర్లను మొదట నిర్ణయించుకోవచ్చును. తరువాత ఆ పేర్లనించీ పైని వివరించిన లాటరీ పద్ధతిని ఒక పేరు గ్రహించవచ్చును. ఈ పద్ధతిని ప్రజాస్వామికంగా, సమంజసంగా కనిపిస్తున్నది. ఈ విధానమునే ప్రతి పరిపాలన శాఖయందునూ ప్రవేశపెట్టు మార్గాలను అన్వేషించవలె.



# 12

# స్వదేశ సంస్థానాలు.

భారత స్వరాజ్యసిద్ధికి ఆటంకమైన వాటిలో స్వదేశ సంస్థానాల సమస్య ఒకటి. సంస్థానాలు బ్రిటిష్‌వారి ఒరలలోని కత్తులు, రెండువైపులా పదునుగల కత్తులు. అఖిలభారత రాజ్యాంగ సంస్కరణలు ఏవి ప్రవేశపెట్టవలసివచ్చినా ఇవి అడ్డువస్తూనే ఉన్నవి. బ్రిటిష్‌వారితో కావించుకున్న సంధి షరతుల ప్రకారం వాటికి కొన్ని ప్రత్యేకహక్కులు ఉన్నట్లూ, అఖిలభారత సమాఖ్యలో అవి చేరటంగాని, చేరకపోవటంగాని వాటి యిష్టమే అయినట్లూ చెబుతారు. ఆ సంస్థానాలలోనైనా సంపూర్ణ బాధ్యతాయుత ప్రభుత్వం ప్రవేశపెట్టరు! అందుకు ఆ సంస్థానాధీశులు చెప్పే సాకు ఒక్కటే: "మాకుమేమై ఏమిచేయగలం మరి? బ్రిటిష్ ప్రభుత్వంతో ఏమిమాట వస్తుందో తరువాత! వారు తల ఊపందే మా సంస్థానాలలోనైనా మేమేమీ ప్రముఖ సంస్కరణలను అమలుచెయ్యలేము" అని. ఈవిధంగా వీరు బ్రిటిష్ ప్రభుత్వపు 'సామంత తాబేదారులే'. అయినాకూడా వీరివే పెద్ద సమస్యలైపోయి, భావిభారత రాజ్యాంగ నిర్ణయ సందర్భంలో జాతీయవాదులు తల పగులగొట్టుకోవలసి వస్తున్నది. నిజానికి వీరు బ్రిటిష్ ప్రభుత్వంతో కావించుకున్న సంధి పత్రాలు చిత్తుకాగితాలతో సమానం. "బ్రిటిష్ చక్రవర్తిత్వాన్ని ఇక్కడ సుస్థిరం చేసుకునేందుకుగాను మన సంస్థానాధీశుల కేవో హక్కులంటూ పేర్కొన్నారు. సంధిపత్రాలద్వారా దత్తమైన హక్కులను సంస్థానాధీశులు వినియోగించుకోవచ్చును. బకాసురుని ముందు పుల్లయ్య హక్కులు ఎలాచలామణి ఔతాయి?"

సంస్థానాల సరిహద్దులుకూడా అసందర్భముగానే ఉన్నవి భాషా ప్రయుక్తంగాగాని, వైజ్ఞానికంగాగాని, ఆర్థిక దృష్ట్యాగాని అవి సమర్థనీయములు కావు. ఎన్నివిధాల చూచినా భారతభూమి అఖండము. అందుచేత ఈ సంస్థానాలనుకూడా ఇతర రాష్ట్రాలతో కలిపివేసి అఖిలభారత

సమాఖ్యలోని వివిధ ప్రాంతాలను, వాటి సరిహద్దులను మళ్లీ నిర్ణయించవలసి
యున్నది. బ్రిటిష్ ప్రభుత్వం ఈ సంస్థానాలతో చేసుకున్న సంధులను
వదులుకోవటమో, లేకపోతే వాటిని స్వతంత్ర భారత ప్రభుత్వానికి ఇచ్చి
వేయటమో జరిగితే మంచిది. సంస్థానాధీశులు సంధిపత్రాలను చింపివేసి
భారతప్రజల ఆశయాలతో ఏకీభవించటము అంతకంటే మంచిది. ఈరెండు
పద్ధతులలో ఏది జరుగకపోయినా బ్రిటిష్ ప్రభుత్వం భారతసమస్యా పరి
ష్కారానికి సుముఖంగా లేదని మనం నిర్ణయం చేసుకోవచ్చు. సర్ జార్జి
సస్టర్ ఇలా రాస్తున్నాడు:

"ఫెడరల్ రాజ్యాంగమే భావి భారత రాజకీయ సౌధానికి చెదరని
పునాదులు వేయగలదు; సంస్థానాలలో మురిగి పోయిన పాతపద్ధతులు
నశించి, ఉన్నతాశయాలతో పరిపాలనసాగే అవకాశాలను కల్పించగలదు.
భారతదేశంలో సంస్థానాలూ, మిగిలిన ప్రాంతాలూ సాంఘికంగా నేమి,
ఆర్థికంగా నేమి సన్నిహిత సంబంధ బాంధవ్యాలు కలిగి వున్నవి అటువం
టప్పుడు కేంద్రంలో జాతీయ ప్రభుత్వం ఏర్పడి, సంస్థానాలు భారత
సమాఖ్యలో చేరకపోతే...అది అనర్థదాయకమే. సంస్థానాధీశులు తమ
క్షేమమును ఆలోచించుకుని, తమ సంస్థానాలు నాలుగుకాలాలపాటు వర్ధిల్ల
వలెనంటే భారతసమాఖ్యలో చేరి బలపడటమే మంచిది.

అంటే...ప్రస్తుత పరిస్థితులను గమనించి, భారత ప్రజలతో చేతులు
కలపండని...ఇది సంస్థానాధీశులకు హితబోధ అన్నమాట ఇన్నాళ్లనించీ
వారు బ్రిటిష్ కత్తినీడన సురక్షితులై వుంటూ, ప్రజలయెడ నియంతలవలె
వ్యవహరించారు. ప్రజలిప్పుడు అహింసాతత్వానికి బద్ధులై ఉన్నారు;
సంస్థానాధీశులు వారినిచూచి భయపడ నవసరంలేదు, ప్రజలు వారియెడ
అన్యాయంగా ఒక్కనాటికీ ప్రవర్తించరు వారి ధర్మగుణమును సంస్థానా
ధీశులు విశ్వసించవచ్చును. కాని సంస్థానాలలో తమ నిరంకుశత్వం యిలాగే
సాగనిస్తారనిమాత్రం ఆశించకూడదు.

# 13

# జాతీయరక్షణ

సత్యాహింసలలో గాంధీజీకి గల అచంచల విశ్వాసం పలువురెరిగినదే. హింసకన్న అహింసయే ఉత్తమమైనదని ఆయన నమ్మకం. శత్రురాజ్యాలను ఎదుర్కొనేందుకు స్వతంత్ర భారతదేశం మారణాయుధాలను సమకూర్చుకో నవసరంలేదు. శత్రుదండయాత్రలను ధైర్యంగా, విజయవంతంగా ఢీకొనటానికి మనం క్రమబద్ధమైన అహింసాశక్తిని సమీకరించుకోవలెనని గాంధీజీ ఉద్దేశం. నిస్సహాయస్థితిలో ఉన్న బ్రిటన్‌ను హిట్లరు కబళించేందుకు సిద్ధంగా ఉన్నరోజుల్లో గాంధీజీ తన శంఖం పూరించి, హింసావిధానం ద్వారా లభించే విజయం నిష్ప్రయోజనమనీ, జర్మనీని బ్రిటనులు నిరాయుధులై యెదుర్కోవలసిందనీ అహింసాపాఠమును ప్రబోధించాడు:

"మిమ్మల్నీ, మానవజాతినీ సంరక్షించలేని ఆ ఆయుధాలను విసర్జించండని కోరుతున్నాను. హిట్లరునూ, ముసోలినీని రమ్మనమనండి, మీవి యని చెప్పుకుంటూన్న దేశాల్లో వారికేమి కావాలో తీసుకోనీయండి. మీ ద్వీపాన్ని, మీ సుందరభవనాలనూ వారు ఆక్రమించనీయండి. మీరు సర్వం యిచ్చివెయ్యండి; మీ మనస్సులను, ఆత్మలనుమాత్రం యివ్వవద్దు"

అద్భుతము, చిరస్మరణీయము అయిన యీ విజ్ఞప్తి బ్రిటన్‌లోని ప్రతి వ్యక్తినీ ఉద్దేశించి చేసినది. బ్రిటన్ చరిత్రలో అత్యంత విషాదకరమైన ఘట్టము సాగుతూన్న క్లిష్ట దినములలో ఇట్టి హితోపదేశమును చేయుటకు ఒక్క గాంధీ మహాత్మునికే తప్ప మరెవరికీ దమ్ములు లేకపోయినవి. పరుల పరిహాసానికికూడ వెరవక తన హృదయభావాలను నిర్భయంగా వెల్లడించాడాయన. ఆయుధ సామగ్రితో సంపాదించిన విజయము ఎంత నిష్ప్రయోజనమో గత రెండు యుద్ధాలూ నిరూపించినవి. "విజయముకన్నా భయంకరమైనది మరొకటిలేదు—ఒక్క ఓటమి తప్ప" అన్నాడు నెపోలియన్‌ను

ఓడించిన ఖ్యాతిమంతుడు డ్యూక్ ఆఫ్ వెలింగ్టన్. భావగర్భితమైన ఆ వాక్యాన్ని ప్రపంచం విస్మరించదు. అట్లాంటిక్ ఛార్టరుకూడా పాపం సంధిదోషంకొట్టి చచ్చిపోయిందిగాని "ప్రపంచంలో అన్నిజాతులవారూ భౌతిక దృష్ట్యా చూచినా, ఆధ్యాత్మిక దృష్ట్యాచూచినా ఆయుధ విసర్జనము చేయటమే మంచిది." అన్నసత్యాన్ని గుర్తించింది వొళ్లు జలదరించే శాస్త్ర పరిశోధనలు సాగిసాగి, చివరకు రుద్రాస్త్రంలా 'అటంబాంబు' పుట్టుకొచ్చింది; ఇక మన మీ మారణాయుధాలకు స్వస్తిచెప్పి అహింసాశక్తిని అలవరచుకోనవలసిన అదను ఆసన్నమైనది. అటంబాంబును మించిన ప్రళయాస్త్రాలనుకూడా అహింసాశక్తి విజయవంతంగా ఢీకొనగలదు. అహింసాశక్తి ఓటమి నెరుగదు. నిజమైన అహింసా తత్వానికి బద్ధమైన జాతి 'యశోవామృత్యుర్వా' అని నవ్వుతూ ప్రాణాల్ని బలి యిచ్చేస్తుంది గాని శత్రువుకు ఎప్పుడూ లొంగిపోదు.

గాంధిజీ శుష్క ఆదర్శవాదికాదు. ఆయన ఆదర్శాలు ఆచరణయోగ్యాలే. యథార్థ పరిస్థితులను ఆయనకన్నా నిశితదృష్టితో గమనించగలవారెవరు? భారతీయుల శక్తి సంపదలెట్టివో ఆయనకు తెలుసు. స్వతంత్ర భారత దేశము 'అహింసాసైన్యాన్నే' ఉంచుకునేందుకు నిర్ణయించేట్టయితే ఆయన సంతోషిస్తాడు; కాని తన ఆశయము అద్యతనభావికాలంలో సిద్ధించగలదన్న నమ్మకం అయనకు లేదు. "భారత దేశం తన గౌరవప్రతిష్ఠలకు భంగం కలిగే సమయంలో పిరికిపడిపోయి, నిస్సహాయయై చూస్తూ ఊరుకోవటంకంటె ఆయుధాలు ధరించి ఆత్మ సంరక్షణము చేసుకోవటమే మంచిది" — అన్నాడు గాంధిజీ.

"ఈనాటి నా స్వరాజ్యంలో సైనికులు ఉండవలసివచ్చేట్టే ఉంది. క్రమశిక్షణ కలిగి, ధీశాలురు, విద్యావంతులూ అయిన పోలీసులు మన స్వరాజ్యంలో ఉంటారు... దేశంలో శాంతికాపాడేందుకూ, శత్రుదాడుల నెదుర్కొనేందుకున్నూ. అప్పటికి నేనుగాని మరింకొకరుగాని అంతకన్నా ఉత్తమమైన పంథా సూచించలేకపోతే... అదేపద్ధతి అమలులో ఉండగలదు".

భారత జాతీయ రక్షణకోసం గాంధిజీ ఉద్దేశించే జాతీయపోలీసుదళ నిర్మాణం ప్రస్తుత పోలీసు-సైనిక శాఖలను పోలియుండదు; పూర్తిగా మరొక రూపంలో ఉంటుంది.

"జాతీయ సైనికులు అహింసా తత్వంలో విశ్వాసంగలవారై ఉంటారు వారు ప్రజల సేవకులు; ప్రజలపై దౌర్జన్యం చేసేవారు కారు. వారివద్ద కొన్ని రకములైన ఆయుధాలు ఉంటాయి; కాని వాటిని బహు అరుదుగా అత్యవసర సమయాల్లోనే ఉపయోగిస్తారు. పోలీసువారంటే ముఖ్యంగా సంస్కర్తలన్నమాట" !

జాయతీ సైనికదళం కేంద్రపంచాయతీ అధికారంలో ఉంటుంది. సర్వసైన్యాధిపతిని కేంద్రపంచాయతీయే నియమిస్తుంది. అతడే రక్షణ శాఖామంత్రిగా ఉంటాడు. సైనిక దళంలో అంతా భారతీయులే ఉండవలె. అప్పుడు సైన్య నిర్మాణ సంచలనాది వ్యవహారములలో ఆరితేరిన విదేశపండితుల సలహాలను స్వీకరింపవచ్చును.

భావిభారత రాజ్యాంగంలో రక్షణశాఖ ప్రాముఖ్యమును ఈసందర్భంలో రవ్వంత చర్చిద్దాం. నిరంతర సంగ్రామ దూషితమైన ఈ ప్రపంచంలో రక్షణశాఖ అవశ్యకత ఎంతైనా ఉంది. కాని గాంధీ రాజ్యాంగంలో భారతదేశము శత్రుదాడులను గురించి భీతిపెట్టుకో నక్కర్లేదు. ఎందుచేతనంటే___

(a) ఏ రాజ్యమైనా భారతదేశంపైకి దండెత్తి వచ్చేట్టయితే అది ప్రపంచయుద్ధంగా పరిణమించక తప్పదు. భౌగోళికంగా, కీలకస్థాన దృష్ట్యా ఇండియా ఉనికి అట్టిదీ మరి.

(b) ఇండియా తనకు తాను స్వయం పోషకంగా ఉండవలెనన్న ఆశయంతోనే తన ఆర్థిక నిర్మాణము కొనసాగించుకుంటుంది. సామ్రాజ్యవిధానము ననుసరించదు; ఇతర దేశాల్లో తన వర్తకస్థానాలను పెంపుచేసుకోవాలని పరుగులు పెట్టదు. అందుచేత పరాయి దేశాలతో పొరపులు పెరిగే అవకాశాలు తగ్గుతాయి.

(c) భారతదేశంలో ఏ గ్రామాని కా గ్రామం స్వయం సమృద్ధిగా ఉండేలాగు ఉత్పత్తివిధానం ఉంటుంది. కాగా ఈదేశంతో వర్తక సంబంధం ఇతర దేశాలకు ఎక్కువగా ఉండదు. ఈదేశంమీదికి దండెత్తి రావాలన్న ఆశ ఎవరికీ ఉండ నేరదు.

గాంధీజీ అధ్వర్యాన అహింసద్వారా భారతదేశం రాజకీయ స్వాతంత్ర్యం పొందిన మరునాడు......ప్రస్తుతం యుద్ధం ప్రీతితో వరిస్తున్న అన్నిజాతులవారికీ చక్కనినీతి నేర్పగలదు. గాంధీజీ అన్నట్లు భారత స్వాతంత్ర్యమే ప్రపంచ శాంతి భద్రతకూ, అంతర్జాతీయమైత్రికీ తారకమంత్రం.

# 14

# అల్పసంఖ్యాక సమస్య

అల్పసంఖ్యాక సమస్య ఒక్క భారతదేశం కాదు, అన్ని దేశా
ల్లోనూ ఉన్నదే: అంతర్జాతీయ సాంప్రదాయాల ననుసరించి అన్ని
రాజ్యాల్లోనూ అల్పసంఖ్యాకుల హక్కులు సంరక్షింప బడుతూ
ఉంటాయి. కాని సామ్రాజ్యవాదులైన బ్రిటిష్‌పాలకులు 'విభజించిపాలించు'
సూత్రాన్ని విడిచిపెట్టరు. అందుచేత భారతదేశ మతసమస్యను కొండంతగా
చేసి, ప్రపంచానికి విడ్డూరంగా ప్రదర్శిస్తున్నారు; హిందువులూ, ముస్లింలూ
అనుక్షణమూ ఒకరిగొంతుకలొకరు నులిమివేయడానికి పొంచివుంటారనీ...
తాము గనుక ఇండియానుంచి వైదొలగిపోతే ఇక్కడ అంతర్యుద్ధం తప్పదనీ
...ప్రచారం చేస్తూ ఉంటారు; అందుకు అనుగుణంగా, వారి రోజులు
బాగున్నాయి కాబట్టి జిన్నాను తమ గుప్పెటలో పెట్టుకో గలిగారు.
తెలిసో, తెలియకో ఆ ముస్లిమ్ నాయకమ్మన్యుడు వారి కూటనీతికి అను
రూపంగానే ఇక్కడ నాటకం ఆడుతూంటాడు.

చరిత్ర పరిశీలించి నట్లయితే భారతజాతిలో అసలీ మత వైషమ్యాలను
పెంపొందించినది బ్రిటిష్‌వారే నని సుస్పష్టంకాగలదు. ఈ దేశంలోని రాజ
శ్రీయా:కారమును వారు ముస్లింల చేతుల్లోనించి లాగికొన్నారు, అందుచేత
పందొమ్మిదవ శతాబ్దాంతంవరకూ ముస్లింలయెడ అపనమ్మకంగానే మెలగు
తూ వచ్చారు. ఇరవయ్యో శతాబ్దారంభంలో హిందూ-ముస్లింల సమైక్యతను
ఊహించుకుని మతవైషమ్యాలు ఇంతై, మరింతై వర్ధిల్లగలందులకు బీజాలు
నాటారు. 1906 అక్టోబరు 1వ తేదీ భారతజాతి చరిత్రలో దుర్దినం. ఆనాడు
మహమ్మదీయ ప్రతినిధివర్గం ఆగాఖాన్ అధ్యక్షను అప్పుడు వైస్రాయిగా
నున్న మింటోప్రభువుకు ఒక మహజరు దాఖలు చేశారు. స్థానిక-రాష్ట్రీయ
కేంద్ర యెన్నికలలో మహమ్మదీయులను ఒకప్రత్యేక జాతినిగా అంగీకరింప

కలసినదిగా రాజప్రతినిధిని వారు అర్థించారు, అలా వెళ్లిన ఆమహామ్మదీయ ప్రతినిధులను తీవ్రంగా విమర్శించాడు, నిరసించాడు మౌలానా మహామ్మదాలీ. ఈప్రతినిధి వర్గము కొందరు బ్రిటిష్ ఆఫీసర్లచే ప్రోత్సహింపబడినట్టు డాక్యుమెంట్లు ఉన్నాయి. బహుశః ఆ మహజరును అప్పుడు అలీఘర్ కాలేజి ప్రిన్సిపాల్ గా వున్న ఆర్చిబాల్డు తయారుచేసి వుంటాడు. "నేను మీతో పూర్తిగా ఏకీభవిస్తున్నాను" - అన్నాడు మింటో ప్రభువు ఆప్రతినిధి వర్గంతో. వెంటనే ఈ దురదృష్టపు భారతదేశంలో ప్రత్యేక నియోజక వర్గాలను ఏర్పరిచాడు. ఇండియా కార్యదర్శిగా ఉండిన మార్లే ప్రభువు సంయుక్తనియోజక వర్గాలనే అభిమానించాడు. ఆయన మింటో ప్రభువుకు ఇలా రాశాడు ఒకసారి:

"మహామ్మదీయ సమస్యవిషయంలో నేను నీ అడుగుజాడ లనుసరించ లేను. మరొకసారి నేను నీకు గౌరవపురస్సరంగా తెలియపరుస్తున్నాను. వారి ప్రత్యేక హక్కులనుగూర్చి నీవు అసమయంలో ఉపన్యసించావు; దానితో ముస్లిం కుందేలు పందేనికి కాలు దువ్వుతుంది"

రాంసే మాక్డొనాల్డుకూడా తన 'Awakening of India' అన్న గ్రంథంలో బ్రిటిష్‌వారే ఇండియాలోని ప్రత్యేక నియోజక వర్గాలకు కారకులని నిక్కచ్చిగా తెలుపుతున్నాడు. ఇదంతా భారతజాతీయైక్యతను భంగపరచవలెనన్న దురుద్దేశముతో చేసినపనియని...మింటో ప్రభువుకి ఒక పెద్ద ఆఫీసరు రాసిన ఉత్తరాన్నిబట్టి తేలిపోతున్నది. ఈ ఉత్తరం మింటో ప్రభు డైరీలో ఉదాహృత మైనది:

"భారత దేశాన్నీ, భారతదేశ చరిత్రనూ కలకాలం వేధించగల ఒక ప్రముఖ సంఘటనమే జరిగింది. ఏనాటికైనా మనపై తిరుగుబాటు చేయగల శక్తులతో చేరకండా 62 మిలియనుల మందిని చీలదీయగలిగాం" - అని తాకా డా ప్రబుద్ధుడు.

సైమన్ కమీషన్ కేంద్రసంఘంవారి విజ్ఞప్తిలో కూడా ఇలాఉంది:

"ఆనాడు ముస్లింలు తమకు ప్రత్యేక నియోజకవర్గాలు కావలెనని బుద్ధిపూర్వకంగా అడిగినదిలేదు. ఒక ఆఫీసరు ప్రోత్సాహానికి లొంగిపోయి వాళ్లు అలా అడిగారు. ఆఫీసరుపేరు అందరికీ తెలిసినదే." [P. 117]

1916 లో లక్నో ఒడంబడిక ద్వారా హిందూ - ముస్లిం విభేదాలను పరిష్కరించేందుకు ప్రయత్నం జరిగింది. కాని ఆ ఒడంబడిక ద్వారా ముస్లిం లకు లభ్యమయేదానికన్న ఎక్కువగా ఇస్తామని వాగ్దానాలు చేసి, మత సామరస్య సిద్ధికి మరొకసారి అడ్డు తగిలారు. 1919 లో మాంటుఫర్డు సంస్కరణల ద్వారా ఈ మత నియోజక వర్గాలకు పూర్తిగా ప్రాణంపోయటం జరిగింది. ఆ అనర్థం ఇప్పటికీ మనల్ని అంటిపెట్టుకునేవుంది. ప్రత్యేక నియోజక వర్గాలద్వారా, మత ప్రాతినిధ్య ప్రాతిపదికపై శాసనసభల నిర్మాణము సాగుతూవున్నందువల్లా నానాటికీ ప్రాను ముస్లింలవైపే మొగ్గుతూవచ్చింది. నాటికి నేటికి చల్లగా 'పాకిస్థాన్' నినాదంకూడా బయలుదేరింది. కాగా ఈ పాకిస్థాన్‌ను పితృదేవుడు మింటో ప్రభువే గాని, అకబాల్ కాదు; రహమత్ అలీ 1 కాదు; జిన్నా కాదు.

ఇక్కడ మన మీ పాకిస్థాన్ సమస్యనుగూర్చి స్తనశల్య పరీక్ష చేయ వలసిన పనిలేదు. అందునుగూర్చి చాలగ్రంథాలు బయలుపడినవి 2 చదువుకో వలెనంటే. ఈ పాకిస్థాన్ నినాదం అవాంఛనీయము, అవివేకజనితము, ఆచరణ దుస్సాధ్యము అని మనం తెలుసుకోవలె. హిందూ ముస్లింలు ప్రత్యేక జాతులన్న వాదం అర్థరహితమైనది.

"విభజన అనర్థదాయకము. హిందూ ముస్లిం సంస్కృతి సభ్యతలు పరస్పర విరుద్ధములన్నమాట నేను విశ్వసించలేను. నిన్న మొన్న హిందువులుగా వుండిన లక్షలాది ప్రజలు ఇస్లాంమతాన్ని స్వీకరించినంతమాత్రాన వారిజాతి ఒక్కసారిగా మారిపోయిందని నేను విశ్వసించలేను" అన్నాడు గాంధీజీ.

పాకిస్థాన్ నినాదం అల్పసంఖ్యాక సమస్యను పరిష్కరింపజాలినది కాదు; పైగా దాన్ని మరింత క్లిష్టం చేస్తున్నది: పాకిస్థాన్‌లో లక్షలాది

---

1 రహమత్ అలీ కేంబ్రిడ్జి పట్టభద్రుడు; పంజాబీ యువకుడు. పాకిస్థాన్ అను పదాన్ని సృష్టించాడు. పంజాబ్, ఆఫ్గనిస్థాన్, కాశ్మీర్ సింధు, బెలూచీస్థానాల కూటమిని ఆ పదం సూచిస్తుంది.

2. పాకిస్థాన్‌ను గురించి చర్చించిన గ్రంథాలు. (a) "The communal triangle in India" By Asoka Mehta & Achyut Patwardhan (b) "India divided" by Dr. Rajendra Prasad (c) "Pakistan or partition of India" by Dr. Ambedker.

హిందువులు; హిందూస్థాన్‌లో లక్షలాది ముస్లింలు తమ హక్కుల సంరక్షణ కోసం ఆందోళన చేస్తూనే ఉంటారు. ఇండియాను రెండు ఖండికలుగా విభజించినందువల్ల దేశరక్షణబలం క్షీణిస్తుంది; కావలసినంత ఆర్థిక సంపద దుర్వ్యయమైపోతుంది; అంతర్జాతీయ ప్రతిష్ఠ సన్నగిలుతుంది “అఖిలభారత సమాఖ్య కొలది సంవత్సరాల్లోనే పెద్దరాజ్యాలతోటి సమాన స్థాయీ అందు కోగలదు” అంటాడు ప్రొఫెసర్ కూప్‌లాండు. విభాజిత భారతదేశం అట్టి ఉన్నతస్థాయిని ఎన్నటికీ చుంబించలేదు.

నిజానికి గాంధీజీ అహింసా సిద్ధాంతాల ననుసరించి ఏర్పడిన భారత రాజ్యాంగంలో అల్పసంఖ్యాక సమస్య అంటూ ఉత్పన్నం కానేకాదు. ఎందుచేతనంటే — పరస్పర సహనము, సానుభూతి అహింసాతత్వములోని ముఖ్యోద్దేశాలు. ఇతర్ల హక్కులను ప్రతివాడూ గౌరవించవలసినదే. భయం అనుమానం, అపనమ్మకం పటాపంచలై పోతాయి. ‘పాకిస్థాన్’ ‘దేశవిభజన’ ఇలాంటి నినాదాలకు తావే ఉండదు.

దేశాన్ని విభజించవలసినదంటూ ముస్లింలు మొండిపట్టుతో తిరుగ బడేటట్లయితే అహింసావాదియైన గాంధీజీ బలపూర్వకంగా వారిని అడ్డగించటం జరగదు. “కాని దేశవిభజనకు నేను ఒక్కనాటికి అంగీకరించను. అట్టి అనర్థం జరగకుండా అహింసాపద్ధతిని శాయశక్తులా ప్రయత్నిస్తాను. దేశాన్ని విభజించమంటే అనేకశతాబ్దులనించీ లక్షలాదిహిందూ–ముస్లింలు ఒకేజాతిగా ఏకము కాగలందులకు చేసిన కృషిని యావత్తూ ధ్వంసము కావించటమన్న మాట.”

రెండుమూడు ప్రత్యేక రాజ్యాలుగా భారతదేశాన్ని ఖండించటము ఆత్మవిధ్వంసకమైన పని అట్టి అనర్థం జరక్కుండా గాంధిజీ అహింసా పద్ధతిని, ఆధ్యాత్మికబలంతో తప్పనిసరిగా ఎదుర్కొంటాడు; అవసరమైతే ‘అఖండహిందూస్థాన్’ కోసం ప్రాణాల్నికూడా బలిఇవ్వడానికి సిద్ధంగా ఉన్నాడు.

మన అదృష్టవశాత్తు ముస్లిం ప్రజాబాహుళ్యంలో సద్వివేచన సుహృద్భావము లేకపోలేదు. కాని ప్రభుత్వంవారు మాత్రం ఇంధనాలు ఎగ తోస్తూ మతవైషమ్యాల్ని పురికొల్పుతున్నారు. బ్రిటిష్ పెద్దలు నిజంగా మన దేశ రాజకీయాధికారాన్ని మనకు వొప్పజెప్పెయ్యాలని చిత్తశుద్ధితో ఉన్నట్లయితే ఈమతసమస్య మూడునిమిషాల్లో పరిష్కారమై పోతుంది” ఇదివరకు కమ్యూనల్ ఎవార్డు తెచ్చిపెట్టిన బ్రిటిష్ సామ్రాజ్యవాదులు ఇకముందు

పాకిస్థాన్ కూడా మనసెత్తిన దుర్దశారని నాకు భయంగానే ఉంది. ప్రభుత్వంవారు ఇక తమ 'విభజించి పాలించు' అన్న సూత్రాన్ని విడిచిపెట్టవలసి వుంటుందని మనం హెచ్చరిక చెప్పాలి. ప్రత్యేక నియోజకవర్గాల్ని ప్రవేశపెట్టిన బ్రిటిష్ ప్రభుత్వమే మరల న్యాయబుద్ధితో దాన్ని రద్దుచెయ్యాలి. తామే రాజనీతిజ్ఞుల మని బ్రిటిషర్లు భావించకుందురుగాక! ఒక్కరేం డాదిపాటు భారతీయులు బ్రిటన్‌ను పరిపాలించటం సంభవిస్తే ఇంగ్లండు-స్కాట్లండు-వేల్సు ఈ మూడు పరగణాలవారూ మూడు ప్రత్యేక జాతులనీ, మూడు స్వతంత్ర రాజ్యాలుగా విడిపోవాలని తీవ్రంగా కాంక్షిస్తున్నారనీ రుజావు చేయగలం.

అంతర్జాతీయ సాంప్రదాయాల ననుసరించి ఇండియాలో అల్పసంఖ్యాక సమస్యను పరిష్కరించే నిమిత్తం మన భవిష్యద్రాజ్యాంగంలో చేర్చవలసిన కొన్ని అంశాలు.

[a] అల్పసంఖ్యాక వర్గాలవారి సంస్కృతులను, భాషలను, లిపులను, విద్యాభివృద్ధిని, వృత్తులను, మతస్వాతంత్రాన్ని, సాంఘికాచార సాంప్రదాయాలను గౌరవిస్తామని హామీ ఇవ్వాలి.

[b] అఖిలభారత సమాఖ్యలోని ప్రతి ప్రాంతాలూ ఆర్థిక - రాజకీయ - సాంస్కృతిక క్షేత్రములలో సర్వతంత్ర స్వతంత్రం అనుభవిస్తాయి. స్వయంసమృద్ధములై, స్వయంపరిపాలనగలిగి గ్రామాలు వర్ధిల్లగలవు. ఇలాంటి ఉత్తమరాజ్యాంగంలో అల్పసంఖ్యాక సమస్యదుస్స్వప్నము గా ప్రవృద్ధి చెందనేరదు

[c] సంయుక్త నియోజకవర్గాల ద్వారానే ఎన్నికలుజరగాలి; వారికి న్యాయంగా కొన్నిసీట్లు రిజర్వు చేస్తారు; అయినా ఇతరసీట్లకుకూడా పోటీచెయ్యవచ్చును అహింసాపద్ధతిని ఏర్పడే మనరాజ్యాంగంలో కొన్నిసీట్లు (స్థానాలు) వారికి ప్రత్యేకంగా రిజర్వు చేయనక్కర్లేదు నిజానికి. కాని ఆదిలో కొంతకాలంవరకూ ఆపద్ధతిని అనుసరింపవచ్చును.

(d) ఎట్టి వివక్షతలనూ పాటించకుండా, అర్హతానర్హతల విచారణే లేకుండా వయోజనులందరికీ వోటు హక్కు ఉంటుంది.

(e) ప్రజా సౌకర్యములకు సంబంధించిన శాఖలలో ఉద్యోగాలిచ్చే అధికారం ఏపార్టీ యెడలా పక్షపాతంలేని పబ్లిక్ సర్వీసు కమీషన్‌కు

ఉంటుంది. పరిపాలనా దక్షతకు లోపం రాకుండా అర్హతలను గమనిస్తూ, అన్ని మతాలవారినీ సంతృప్తి పరచునట్టుగా ఉద్యోగాల పంపిణీని నిర్వహించవలె.

మైనారిటీ హక్కులను గురించీ, ప్రాతినిధ్యంగురించీ వివరాలను సేకరించే నిమిత్తం రాజ్యాంగ నిర్ణయ సభవారు ఒక కమిటీని నియమిస్తారు. అవసరమైతే ఈ సమస్యనుగూర్చిన అంత్య నిర్ణయం ఒక అంతర్జాతీయ మధ్యవర్తుల సభకు విడిచిపెట్టవచ్చును. బ్రిటన్‌కుగాని, బ్రిటిష్ డొమినియనులకుగాని మధ్యవర్తిసభలో సభ్యత్వం ఉండకూడదు.

రాజ్యాంగం ఎంత ఉత్కృష్టమైనదైనా, అల్ప సంఖ్యాకులకు ఎన్ని హక్కులు గ్యారంటీ చేసినా, వివిధ వర్గాలవారి మధ్య సౌమనస్యం లేని పక్షంలో ఫలితం దక్కదు. కాని వివిధమతాలవారి నాయకులు అట్టి సౌమనస్యాన్ని పెంపొందించగలరు.

"వారు మాటల్లోనూ, చేతల్లోనూ ఔదార్యం ప్రకటించాలి. సకాలంలో తమతమ హక్కులనుగూర్చి సౌమ్యమైన భాషలో హెచ్చరిక చెయ్యాలి. సభ్యత నతిక్రమించకూడదు. ఓర్పు సహనం అవసరం. తమ తమ ఉద్యమాల్లోని న్యాయం, ధర్మం ఇతర్లకు నచ్చచెప్పాలి. ప్రజలందరికీ సంబంధించిన సంస్థలనూ, కార్యక్రమాలనూ ప్రోత్సహించాలి. జాతిలో పరస్పరద్వేషాలను, వైషమ్యాలను మొలకెత్తించే శక్తులను నిర్మూలించాలి. అట్టి ఉదారులైన నాయకులద్వారా అల్పసంఖ్యాకసమస్య అన్ని ప్రాంతల్లోనూ, అన్ని అంశాల్లోనూ, సార్వకాలికంగా పరిష్కృతమై పోగలదు"!

ప్రస్తుతం ఈదేశంలో హిందువులనూ, ముస్లింలనూకూడా తర్జిస్తున్నది దారిద్ర్యసమస్య. మన అందర్నీ పీడిస్తున్న ఈఆర్థిక దుస్థితిలో మత వైమనస్యాలు అడుగున బడిపోగలవు. స్వరాజ్యం రాగానే ప్రజల జీవన ప్రమాణాన్ని పెంపుచేయటం ఎలాగా అని మన జాతీయ ప్రభుత్వం తీవ్రంగా యోచిస్తుంది. భానూదయంతో మంచువలె ఆనాడు అల్పసంఖ్యాక సమస్య పటాపంచలై పోతుంది.

"స్వతంత్రభారత రాజ్యాంగం అల్పసంఖ్యాక సమస్యను అవశ్యం పరిష్కరించి తీరుతుంది. విదేశీయుల పరిపీడన కారణంగా మనలో మతవిభేదాలు మొలకెత్తినవి, చిగిరించినవి, కాయలు కాచినవి. కాని స్వాతంత్ర్య భానూదయం కాగానే ఈవిభేదాలన్నీ మంచుకొండలవలె కరగిపోతాయి."

## 15

# విదేశాంగనీతి

విశాలాశయాలుగల నెహ్రూపండితుని సహాయమున భారతదేశము అప్పుడే ఒక నిర్ణీత అంతర్జాతీయ విదేశాంగనీతిని అలవరచుకో గలిగినది. ఆనాడు బ్రిటిషువారు అక్షరాజ్యాలను సంతృప్తి పరచేందుకు ప్రయత్నించి, అత్యంత అవమానకరమైన మ్యూనిచ్ ఒడంబడికకు దారితీశారు. అట్టివారి చర్యను ప్రప్రథమంగా ఖండించినది అఖిల భారత కాంగ్రెసుసంస్థ. చైనాలో జపానువారి దురాక్రమణలను నిరసించినది మన కాంగ్రెసుసంస్థ. పరదేశాల దురాక్రమణలతో దేశంలోని అంతర్విప్లవాలతో శతమతమైన చైనాపట్ల నిరంతర సానుభూతిని ప్రకటించింది కాంగ్రెసు సంస్థ. భారత దేశ సంపూర్ణ స్వాతంత్ర్య ప్రకటనచేసిన ఉత్తరక్షణంనించి మిత్రరాజ్యాల వారి యుద్ధకృషికి పూర్ణసహకారం ఇస్తామని చాటిచెప్పినది కాంగ్రెసుసంస్థ. ఇండోనేషియాలోని జాతీయోద్యమాన్ని అణగద్రొక్కటానికి భారత సైనికులను వినియోగించిన బ్రిటీషువారి చర్యను ఖండించారు భారత నాయకులు తద్వారా ఇరుగు పొరుగు రాజ్యాలయెడ భారతీయుల దృక్పథం వెల్లడి ఔతున్నది.

ఐనను భావిభారత రాజ్యాంగ రచనా సందర్భంలో ఒక సుస్పష్టమైన విదేశాంగ విధానమును నిర్ణయం చేయవలసి యున్నది.

(a) భారతప్రజలు తమ ఇరుగు పొరుగు రాజ్యాలతోను, తదితర దేశాలతోను, సమానభావాకలిగి అందరితోనూ శాంతంగా, స్నేహంగా ఉండవలెనని కోరుతున్నారు. ఇరుగుపొరుగు రాజ్యాలలో వారు ప్రాదేశికపు హక్కులేమీ కోరటంలేదు. అన్నిదేశాల స్వాతంత్ర్యాన్నీ వారు అభిలషిస్తున్నారు. అంతర్జాతీయ సౌహార్ద సుహృద్భావములనే భారతదేశము ఆశిస్తున్నది

(b) వర్తక వాణిజ్యాలను పురస్కరించుకొని పరదేశాలను ఆర్థికంగా పీడించవలెనన్న కోరిక దేశాన్ని అలా పీడిస్తుంటే చూచి వూరుకోదు. పరస్పరలాభము, సంపదభ్యుదయము మాత్రమే ఆశయములుగా భారతదేశము ఇతరదేశాలతో వర్తకపు టొడంబడికలు చేసుకుంటుంది.

(c) "అన్నిజాతులవారు స్వతంత్రులై ఒక ప్రపంచసమాఖ్య తక్షణం నెలకొంటేనేతప్ప ప్రపంచశాంతిభద్రలు దుర్లభములని భారతదేశము విశ్వసిస్తున్నది. "అట్టి ప్రపంచ సమాఖ్య సంస్థాపనమువల్ల ఆయుధ విసర్జనము అన్నిదేశాల్లోను సాధ్యముకాగలదు; జాతీయ సైన్యాలు నావికాబలాలు, వైమానికదళాలు, అవసరంలేకుండా కేవలం ప్రపంచ రక్షణదళంవల్లనే ప్రపంచశాంతి నెలకొంటుంది; దురాక్రమణలు నివారితములవుతాయి. భారతదేశము సంతోషపూర్వకంగా ప్రపంచ సమాఖ్యలో చేరుతుంది; అన్నిదేశాలతోటి సమాన ప్రతిపత్తితో వ్యవహరించి అంతర్జాతీయ సమస్యా పరిష్కారానికితోడు పడుతుంది.[1]"

(d) శాంతికోసం, స్వాతంత్ర్యంకోసం, ప్రజాస్వామ్యంకోసం శ్రమించే శక్తులన్నింటికి భారతదేశము తన సంపూర్ణ సహకారమును ఇస్తుంది. దురాక్రమణదారులపై ఆర్థిక ఆంక్షలను విధించే అంతర్జాతీయ అధికారమునకు తోడ్పడుతుంది.

(e) ప్రపంచ ప్రజలసమిష్టి శాంతిసౌఖ్యముల నిమిత్తం భారతదేశము అన్నిరాజ్యాలతోను ఏకీభవిస్తుంది. ఏదేశాన్నిఅయినా అణగద్రొక్కవలెననిగాని, నాశనం చేయవలెననిగాని కావింపబడే ప్రయత్నాలకు దూరంగా వుంటుంది.

(f) పెద్దరాజ్యాలుగాని, చిన్నరాజ్యాలుగాని — అన్నీ స్వతంత్రములుగా ఉండవలసినదేనని భారతదేశం వాంఛిస్తుంది జాతి-మత-వర్ణ-విభేదాలుగాని, ఆర్థిక-సాంస్కృతిక కారణాలుగాని, దేశస్వాతంత్ర్యమునకు ఆటంకములుకారాదు. ఎట్టిపరిస్థితులలోను ఒక జాతి మరొకజాతిని పాలించేహక్కు ఉండకూడదు.

---

[1] అఖిలభారత కాంగ్రెసుసభ తీర్మానము. (8 ఆగస్టు 1942)



# 16

# ఫైనాన్సు-పన్నులు

ప్రస్తుతపు ఫైనాన్సు-పన్నుల విధానం అన్యాయంగాను, అవివేక పూరితంగాను ఉన్నవి. కాబట్టి దానిని పూర్తిగా తిరగదోడి వేయవలసినదే. ఇందును గూర్చి కొన్ని సూచనలు :

[a] స్థానిక స్వపరిపాలనము సవ్యముగా ఉండవలెనంటే జాతీయాదాయమును వికేంద్రీకరించవలసినదే. గ్రామముల ద్వారా వసూలయ్యే భూమిశిస్తులో కనీసము సగభాగమైనా గ్రామ పంచాయతీల పరం చేయాలి.

(b) మిగిలిన సగభాగాన్ని జిల్లా-రాష్ట్ర-కేంద్ర పంచాయతీలు యెలా వినియోగించుకోవలెనో ఆవివరాలను రాజ్యాంగ నిర్ణాయక సభవారు నియమించే సంఘము నిశ్చయిస్తుంది,

[c] స్థానికంగా అయ్యే ఇతర ఖర్చుల నిమిత్తం గ్రామపంచాయతీలు పన్నుల ద్వారా సొమ్ము వసూలు చేయాలి. కోతలకాలంలో సాలు చందాలు, ప్రత్యేకవిరాళాలు, మధ్యవర్తిత్వ రుసుములు, జరిమానాలు బీడు కవుల్లు, మొదలైన పద్ధతులద్వారా సొమ్ము వసూలు చేయవచ్చును. కాయకష్టముద్వారా పన్నులు చెల్లించు విధానాన్ని ప్రోత్సహించటం మంచిది.

[d] ప్రజాసౌకర్యాలకు, సైనిక పోషణకు అయ్యేఖర్చును చాలవరకు తగ్గించాలి. విదేశాలనుండి వచ్చిన సాంకేతిక ప్రవీణులకు తప్ప, దేశీయోద్యోగుల కెవరికీ నెలకు ఐదువందల రూపాయలకు మించి జీతం ఇవ్వకూడదు,

[e] ఆరోగ్యము, విద్య, శాస్త్రపరిశోధనము మొదలైన ప్రజోపయోగ శాఖల ఖర్చును ప్రభుత్వం హెచ్చించవచ్చును.

[f] ప్రస్తుత బాధ్యతారహిత బ్రిటిష్ప్రభుత్వం కావించిన జాతీయ-అంతర్జాతీయ ఋణాలతో స్వతంత్ర భారతజాతీయ ప్రభుత్వానికి నిమిత్తం వుండదు.

[g] ఒకనిర్ణీత మొత్తమునకు పైబడిన వ్యవసాయికాదాయముపై క్రమబద్ధంగా పన్నులు విధించవలెను.

[h] ఒక నిర్ణీత ఆదాయానికి పైబడిన ఆస్తిపాస్తులపైకూడా క్రమబద్ధమైన పన్నులను విధించవలెను

[i] ఆదాయపు పన్నులద్వారా వచ్చే రివెన్యూ రాష్ట్రానిది.

[j] ఉప్పు మనము రోజూపీల్చేగాలివలె ఉచితంగా పంపకం కావాలి.

[k] స్వతంత్రభారతదేశంలో మద్యపాననిషేధము సర్వత్రా అమలులో ఉంటుంది. కాగా మత్తు పదార్థాలపైని పన్నులద్వారా వచ్చే ప్రభుత్వ ఆదాయమేమీ ఉండదు.

[l] ముఖ్యముగా పల్లెటూళ్లలో పన్నులను వస్తురూపేణా చెల్లించేపద్ధతి ప్రోత్సహించవలెను.

[m] కీలకపరిశ్రమలను, ప్రజోపయోగపరిశ్రమలను తమ అధీనంలో ఉంచుకొని రాష్ట్ర కేంద్ర పంచాయతీలు నడుపుతాయి. తద్వారా వాటికి విరివిగా ఆదాయము లభ్యంకాగలదు.



# 17

# జాతీయాదాయం

స్వతంత్ర భారత ప్రభుత్వంలో సొంతఆస్తులు తప్పనిసరిగా నిర్మూలింపబడవు. కాని అవి చాలవరకు కోతబడిపోతాయి. ఆర్థిక తరతమభేదాలను తగ్గించేనిమిత్తం అధిక సంచయాన్ని అరికట్టేస్తారు. ప్రస్తుతము సొంత పెట్టుబడిదారుల అధీనంలోఉండే ఈక్రింది సంపదలు ప్రభుత్వం చేతిలోనికి వచ్చేస్తాయి.

[a] భూమిఅంతా ప్రభుత్వపుసొత్తు. భూస్వామిత్వము, జమీందారీ విధానము, భూమి కవుళ్లపద్ధతి అంతరిస్తాయి. భూమిని కష్టపడిసాగు చేసే రైతులకే కవుళ్లకు యిస్తారు.

(b) కీలక పరిశ్రమలన్నీ ప్రభుత్వం చేతిలో ఉంటాయి. సొంతపారిశ్రామికులు కమీషన్ పద్ధతిమీద వాటిని నడపవచ్చును. కాని ప్రాథమిక పరిశ్రమలను వారు తమసొంతంచేసికొని ప్రజలసొమ్మును తాము కొల్లగొట్టేందుకు వీలులేదు

(c) గనులు, నదులు, అడవులు, రోడ్లు, రైల్వేలు, ఆకాశయానము, తపాలా తంతిశాఖలు, నౌకాయానము, తదితర రవాణా శాఖలుఅన్నీ ప్రభుత్వాధీనములే.

(d) పైని ఉదాహృతములైన ఆస్తిపాస్తులు ప్రస్తుతము ఏ సొంత అధికారుల చేతుల్లోనైనా ఉన్నట్లయితే, ప్రభుత్వం తగినంత నష్టపరిహారము ఇచ్చి వాటిని స్వాధీన పరచుకుంటుంది.



# 18

# విద్యాశాఖ

ప్రస్తుతము భారతదేశంలో అమలునందున్న విద్యావిధానము మన జాతి జీవమునకు అనుగుణమైనదికాదు; మన ఆర్థిక సాంఘిక వ్యవస్థకు భిన్నమైనది; అది మనకెట్టి ఉత్సాహపూరితమైన ఆశయమును ప్రబోధించటంలేదు. కాబట్టి మన జాతీయప్రభుత్వం రాగానే విద్యాశాఖను పూర్తిగా సంస్కరించుకోవలసి ఉంటుంది. ఇందుకు కొన్ని సూచనలు:

(a) ప్రాథమికవిద్య ఉచితము, నిర్బంధముకావాలి. 14 సంవత్సరాలకు లోబడిన బాల, బాలికలకు నూలు వడకుట, వస్త్రములు నేయుట, వ్యవసాయము, మొదలైన పరిశ్రమలద్వారా ప్రాథమిక విద్య గరపవలెను. ఇట్టి విద్యావిధానము ఇండియావంటి బీదదేశంలో మూడు విధాల లాభదాయకమౌతుంది.

1. విద్యార్థులకు నిర్దుష్టమైన విజ్ఞానం అలవడుతుంది.
2. విద్యాబోధనకయ్యే ఖర్చులుకూడా పరిశ్రమలద్వారా వచ్చేస్తాయి.
3. విద్యార్థులకు జీవన నిర్వహణముకోసమైన వృత్తి విద్యకూడా అలవడుతుంది.

(b) విద్యాసంస్థలలో విద్యార్థులను బెత్తముతో శిక్షించకూడదు.

(c) విద్యాబోధనము అన్నితరగతులయందు మాతృభాషలోనే జరిగితీరవలెను. ప్రస్తుతం అమలులోవున్న ఆంగ్లబోధనాపద్ధతి మిక్కిలిఅనర్థదాయకము. "అది జాతీయశక్తులను పీల్చి పిప్పిచేసింది. విద్యార్థుల ఆయుః పరిమితినితగ్గించింది; విద్యావంతులకుజనసామాన్యమునకు మధ్య యొనలేని అంతరమును కల్పించింది. అనవసరమైన ధనవ్యయమును

పెంచింది. ఇదే విధానము ఇంకా సాగినట్లయితే భారతజాతి ఆత్మవినాశనము చెందక తప్పదు."

(d) గ్రామ పంచాయితీలు దేశంలోని నిరక్షరాస్యతను నిర్మూలించేందుకు ఆవశ్యం కృషి చేయాలి. వయోజనవిద్య అంటే చదువను, రాయను నేర్పటమే కాదు. ఆరోగ్యశాస్త్రము, పరిశుభ్రత, వ్యవసాయ పరిశ్రమలలో నూతనపద్ధతులు, సామాజిక సభ్యత మొదలైన విషయాలను గురించి కూడా తెలియజెప్పవలెను. వయోజనులకు కూడ వృత్తి విద్య ప్రధానంగా నేర్పాలి.

(e) కాలేజీలలో ముఖ్యముగా సాంకేతిక విద్యలయందు తర్ఫీదు ఇస్తారు. పరిశోధనలకు అవకాశాలు కల్పిస్తారు. పట్టభద్రులు తమ పట్టాలను స్వీకరించేముందు ఒక సంవత్సరకాలము తప్పనిసరిగా ప్రజాసేవ చెయ్యాలి.



# 19

# నేరము — శిక్ష.

పూర్వకాలంలో నేరస్థులను ఘోరాతిఘోరంగా శిక్షించేవాళ్లు నాగరికత అభివృద్ధిచెందుతూన్నకొద్దీ దండనీతి మారుతూవచ్చింది. నేరస్థులు కూడా మానవమాత్రులే. నేరాలు శారీరక-మానసిక జాడ్యాలవంటివి అవి జరిగిన పరిస్థితులను, మూలకారణాలను పరిశీలించటం నేర్చుకున్నాం. గాంధీజీ నేరాన్ని నిరసించాడుగాని నేరస్థునికాదు. బాగాఆలోచిస్తే అన్ని నేరాలకూ కారణభూతములైనవి దారిద్ర్యము, నిరుద్యోగము, విషాదజీవితము, విద్యలేమి అని తేలుతుంది! నేరాలను రూపుమాపవలెనంటే సాంఘిక వ్యవస్థను, పరిస్థితులను అభ్యుదయకరంగా మార్పుచెయ్యాలి

జడివానకు తడిసిన తరువాత గుడిసె కట్టుకునేకంటే ముందుగానే జాగ్రత్త పడటం మంచిది. మన 'గాంధీ రాజ్యాంగం' లో సూచితమైన పంథాన ఆర్థిక - సాంఘిక పరిస్థితులను చక్కబెట్టుకోగలిగినట్టయితే దేశంలో నేరాలు జరక్కుండా అరికట్టగలము

స్వరాజ్యం రావటంతోనే దేశంలో ఇక అకృత్యాలంటూ ఉండవనుకోటం పొరపాటు. స్వతంత్ర్య భారతప్రభుత్వంకూడా నేరవిచారణలు చెయ్యకతప్పదు. శిక్షలు విధించక తప్పదు; జైళ్లుకూడా వుంటాయి. కాని అప్పటి జైళ్లకూ ఇప్పటిజైళ్లకూ తారతమ్యం ఉంటుంది. ఈనాటి కారాగారాలు నేరస్థులబుద్ధిని మార్చలేకపోతున్నవి; పైగా వారిని మరింత దురాత్ములనుగా తయారుచేస్తున్నవి. కాని స్వతంత్రభారత ప్రభుత్వంలో జైళ్లు సంస్కారణసంస్థలుగా ఉంటాయి. ఈసందర్భంలో సోవియట్ రష్యాలోని 'బోల్షివిక్ రిఫర్మేటరీ కాలనీ' ని గురించిన కొన్ని వివరాలు గమనార్హాలు.

“రష్యాలో బోల్షివోవద్ద (మాస్కో సమీపంలో) నేరస్థులకు శిక్షణ గరిపే సంస్థ ఒకటి ఉన్నది. దాన్ని సోవియట్ ప్రభుత్వం పోషిస్తుంది. ఎంతో ఆదర్శప్రాయంగా కృషిచేస్తున్న దాసంస్థ. షుమారు వెయ్యిమందికి నివసించేందుకు వసతులుగల భవనం అది. గేట్లు ఎప్పుడూ తెరిచేవుంటాయి. అంత కఠిన నిర్బంధనలేమీ ఉండవు. చుట్టూ పల్లె ప్రాంతం. వ్యావసాయిక భూములు ఉన్నాయి; పారిశ్రామిక సంస్థలూవున్నాయి. దొంగతనం, బందిపోటు, దోపిడి మొదలైన నేరాలకు న్యాయస్థానాలలో కారాగారశిక్ష విధింపబడిన వారిని ఈ ప్రదేశానికి తీసుకువస్తారు. అక్కడ అనేక పనిపాటలు ఉంటాయి. వాటిల్లో వారికి పని కల్పిస్తారు. కూలీ ఇస్తారు. సిగరెట్లు త్రాగవచ్చు; స్వేచ్ఛగా మాటాడుకోవచ్చు; ఆహ్లాదంకోసం సంగీతసభలు. నాటక ప్రదర్శనాలు ఏర్పాటుచేస్తారు. ఇష్టం వచ్చినట్లు హాయిగా ఉండవచ్చు. కాయకష్టంచేసి సంపాదించుకుంటూ, విశ్రాంతి సమయాల్లో స్వేచ్ఛగా ఆడుతూ, పాడుతూ — అలా మర్యాదగా జీవయాత్ర గడుపుకొనటము ఉత్తమమనీ — దుర్మార్గాలు చేస్తూ బ్రతకటం నికృష్టమని — వారక్కడ ఏనాటికైనా గుర్తించుకోగలుగుతారు. కొంతకాలమైన తరువాత తమ భార్యలనుకూడా అక్కడికే పిలిపించుకోవచ్చును; అక్కడే కుటుంబజీవితం సాగించుకోవచ్చును. సాధారణంగా ఇక్కడికి తీసుకురాబడిన నేరస్థులు మళ్లీ వెళ్లిపోవాలని కోరరు అక్కడే సుఖంగా, హాయిగా, భార్యలతో కూడా నెలకొనివుంటారు. అలాగ నానాటికీ ఇక్కడ జనసంఖ్య పెరిగిపోతూఉంది. ఇప్పుడక్కడ సుమారు ౪,000ల మంది ఉన్నారు, ఇలా ఒక్క బోల్షివోలోనే కాక, సోవియట్ రష్యాలో ఇంకా అనేకచోట్లకూడా అట్టి సంస్కరణసంస్థలు, అదే పద్ధతి మీద నడుస్తూఉన్నవి”.

స్వతంత్ర భారతదేశంలో ఎంత తీవ్రమైన నేరానికీ ఉరిశిక్ష అంటూ ఉండదు.

అకృత్యాలు జరగకుండా దుర్మార్గులను నైతిక పథానికి త్రిప్పేందుకు సంస్కరణ సంస్థలను భారతప్రభుత్వం నెలకొల్పుతుంది.

క్రిమినల్ చట్టము సాధ్యమైనంతవరకు టూకీగా ఉంటుంది. చట్టము ఎంత క్లిష్టతరంగాఉంటే నేరాల్ని అంత ఎక్కువగా ప్రోత్సహించినట్లే.

# 20

# ప్రజా సౌకర్యాలు

(a) ప్రస్తుతం రాష్ట్రాల్లోనూ, కేంద్రాల్లోనూ ప్రజా సౌకర్యశాఖలలో పనిచేస్తూన్న ఉద్యోగులను పదవులలో ఉంచేందుకు గాని, బర్తరఫ్ చేయటానికి గాని అధికారం ఉంటుంది.

[b] ఉద్యోగకాలపరిమితి ముగిసి 'రిటైరు' అయ్యే ప్రభుత్వోద్యోగులకు సబబైన 'పెన్షన్' మంజూరు చేయబడుతుంది.

[c] స్వతంత్రభారత ప్రభుత్వంలో తమ ఉద్యోగాలను నిలబెట్టుకోగలవారికి పూర్వము పనిచేసియున్న కాలాన్ని కూడా లెక్కలోకి తీసుకునే రిటైరు కావలసిన సమయం, పెన్షను నిర్ణయిస్తారు.

(d) గ్రామాల్లో, తాలూకాల్లో, జిల్లాల్లో కొత్త ఉద్యోగులను చట్టబద్ధంగా ఆయా పంచాయతీలవారు నియమిస్తారు.

(e) రాష్ట్రపంచాయతీలవారు, కేంద్రపంచాయతీవారు 'పబ్లిక్ సర్వీస్ కమిషను' లను నియమిస్తారు. రాష్ట్రీయ-కేంద్రశాఖలలో కావలసిన ఉద్యోగస్థులను ఆ 'పబ్లిక్ సర్వీస్ కమిషను' లు ఎన్నుకుంటాయి. 'పబ్లిక్ సర్వీస్ కమిషన' లలోని సభ్యులు సమర్థులు, శీలవంతులునై యుండాలి.

[f] ఏయే సూత్రాల ననుసరించి ప్రజా ఉద్యోగులను నియమించాలో, 'ప్రమోషన్' చేయాలో, 'రిటైరు' కమ్మనాలో, బర్తరఫ్ చేయాలో ఈ 'పబ్లిక్ సర్వీసు కమీషను' లే నిర్ణయిస్తాయి.

[g] సాధారణంగా అర్హత, సామర్థ్యము, సౌశీల్యము, దేశసేవాశక్తి గలవారినే ఉద్యోగాల్లో నియమిస్తారు. ఉద్యోగాలిచ్చే విషయంలో

అల్పసంఖ్యా వర్గాల వారికీ సంపూర్ణన్యాయం జరుగుతుంది. కాని మతాలవారీగా, గుడ్డిగా, ఉద్యోగాలను పంపిణీచేస్తూ, అసమర్థులను చేర్చుకుని ప్రభుత్వాన్ని బలహీనం చెయ్యరాదు. "పబ్లిక్ సర్వీస్ కమిషనుల సభ్యులు అన్నిమతాల యెడల సమానం కలవారై, నిష్పాక్షికంగా ప్రవర్తించాలి.

[h] భారత రాజ్యాంగంలో నీతినియమాలకు అత్యధిక ప్రాధాన్యం ఉంటుంది ఉద్యోగస్థులు లంచాలు పుచ్చుకుంటున్నట్టు తెలిసినా; దుర్మార్గంగా ప్రవర్తించినా; స్వజనాభిమానంగాని, స్వమతాభిమానంగాని పురస్కరించుకుని అన్యాయంగా ప్రవర్తించినా...క్షమించేది లేదు.

[i] ప్రజాఉద్యోగులు సమర్థులుగా, శీలవంతులుగా తర్ఫీదు కాగలందులకు ప్రత్యేక శిక్షణాలయాలను నెలకొల్పుతారు.

[j] ఉద్యోగస్థులను ఎన్నుకునే సందర్భంలో భారతస్వాతంత్ర్య సమరాంగణాన వీరోచితంగా విహరించిన యువకులకే తప్పనిసరిగా ప్రాముఖ్యం ఉంటుంది.



# 21

# కలగూరగంప

## జండా

నట్టనడుమను రాట్నపు బొమ్మ విరాజిల్లుతూ వుండే
త్రివర్ణ పతాకమే స్వతంత్ర భారత జాతీయ ధ్వజము —

## పరిభాషాప్రకరణము

స్వతంత్ర భారతరాజ్యాంగ పరిభాషాప్రకరణమంతా...
ప్రజాపరిషత్తు నియమించే ఒక ప్రత్యేక కమిటీచేత
హిందూస్థానీభాషలో విరచిత మౌతుందిచి —

## రాజ్యాంగ నిబంధనలు

రాజ్యాంగ నిబంధనల సంస్కరణాధికారం కేంద్రపంచాయతీ సభకు వుంటుంది. అట్టి సంస్కరణల చట్టాన్ని కేంద్రపంచాయతీ సభ, అన్ని రాష్ట్రీయ పంచాయతీసభలు కలిసి 75 శతాంశల మెజారిటీతో ఆమోదింప వలసి వుంటుంది. సంస్కరణలు ఏ ఒక్క రాష్ట్రానికో మాత్రమే సంబంధించినవైతే ఆ అధికారం ఆరాష్ట్ర పంచాయతీకే విడిచిపెడతారు.

ప్రాతమూలకమైన సుప్రీంకోర్టు ఆమోదాన్ని బడసిన తరువాతనే రాజ్యాంగ నిబంధనల సంస్కరణలుగాని, సవరణలుగాని అమలు జరగవలె.



# 22

# తుదిపలుకు

ఈ గ్రంథాన్ని స్థాలీపులాక న్యాయంగా మాత్రమే పేజీలు తిరుగ వేసేవారు... ఇందులో ప్రతిపాదితమైన రాజ్యాంగ ప్రణాళికకూ, ప్రస్తుతం అమలులో వున్న పరిపాలనా విధానానికీ ఎక్కువ తేడా ఏమీ లేనట్లు భ్రమించవచ్చును. గ్రామమనీ, తాలూకా అనీ, జిల్లా అనీ రాష్ట్రం అనీ కేంద్రం అనీ — ఈ విభజనలన్నీ ఇప్పుడు కూడా అమలులో వున్నవిగా మరి! కాని లోతుగా పరిశీలిస్తే మన యీ గాంధీ రాజ్యాంగంలోని విశిష్టత, విశేషము, ప్రత్యేకత గ్రాహ్యమౌతాయి. ఈ రాజ్యాంగ మొక ఉన్నత సౌధము వంటిది. దీనికి వివిధ గ్రామ సంస్థలే విశాలములైన పునాదులు. పై పంచాయతీలవారికి కిందపంచాయతీల వారికి చేదోడు వాదోడుగా ఉంటూ, ఉచితరీతిని సలహాలిస్తూ, వివిధ శాఖలలో వారి కార్యకలాపాలను పర్యవేక్షిస్తూ వారి పరిపాలన విధులు సమర్థములుగా ఉండేలాగు చూస్తూ, అన్ని విధాలా మార్గదర్శకులుగా ఉంటారు. గాంధీజీ అహింసా సూత్రాలపైని నిర్మితమైన యిట్టి స్వరాజ్యంలో నిజానికి కేంద్రప్రభుత్వ బాధ్యతలను నిర్వహించేది గ్రామసభలే. గ్రామసభలు కేంద్రంనుంచి ఆజ్ఞలకు ఎదురుచూస్తూ ఉండవు. అనగా ప్రస్తుత పరిపాలనావిధానము పూర్తిగా తలక్రిందులౌతున్నదన్నమాట. గ్రామమే రాజ్యాంగంలో సత్వవంతమైన ప్రధాన యూనిట్ ఔతుంది.

ప్రస్తుతం భారత గ్రామాలు అధ్వాన్నస్థితిలో ఉన్నాయని కొందరు అభ్యంతరం చెప్పవచ్చును. గ్రామీణులలో పరస్పర మనస్పర్థలు, ఈర్ష్యాద్వేషాలు, పార్టీ వైషమ్యాలు ఉన్నవి. వారు నిరక్షరాస్యులు, రాజకీయ పరిజ్ఞానం ఉన్నవారు కాదు; అందుచేత గ్రామ పంచాయతీలమీద పెద్ద ఆశలు పెట్టుకోవటం, వాటిని విశ్వసించటం అపాయకరమని వారు అంటారు. కాని మన సత్యశాస్త్రంలోని ప్రాథమిక సూత్రాన్ని ఎరుగక పలికిన మాట అది.

"మనం ఇతరులను విశ్వసిస్తే, ఇరరులు మనల్ని విశ్వసిస్తారు." మనకింకా స్వరాజ్యార్హత చిక్కలేదని అస్తమానం అదేపనిగా చెబుతూఉన్నారు బ్రిటిష్ వేత్తలు. కాని మనం ఊరుకుంటున్నామా? "ఎంతమంచిదైతేమాత్రం పరపరిపాలన స్వపరిపాలనతో తులతూగుతుందా యేమిటి?" అని నిలవదీసి అడుగుతున్నాం. ప్రథమంలో ఏవో తప్పులు, పొరపాట్లు చేస్తే చేస్తాం. ఏంచేస్తే? అనుభవంమీద ప్రజాస్వామ్యాలు అవే అలవడతాయి. స్థానిక సర్వతంత్ర స్వపరిపాలనము గ్రామసభల పంచేయటంలో జంకుగొంకులు అనవసరం. క్రమక్రమంగా వాటికి సర్వబాధ్యతలూ వొప్పజెబుతూ పరిపాలనను వికేంద్రీకరించుకోవాలి. ఈ నిర్దిష్ట-ఆశయాన్నిమాత్రం సర్వదా దృక్పథంలో ఉంచుకుని సక్రమంగా కృషిచెయ్యాలి. ఈ గాంధీ రాజ్యాంగంలో మన గ్రామాలు మళ్లీ సంపూర్ణంగా అభివృద్ధిగాంచి, ఉన్నతకెక్కి, చిరకాలము మనగల ప్రజాస్వామిక వ్యవస్థకు ఆదర్శచిహ్నములు కాగలవని నా విశ్వాసం.

---